3 సెప్టెంబర్ 2017

# ఆదివారం ఆంధ్రజ్యోతి

sunday magazine



# గురుభ్యోనమః

# నో టాక్స్!















సందేశపరంగా బాగున్న సినిమాలు ఎక్కువమంది ప్రేక్షకులను చేరాలంటే 'పన్ను రాయితీ' ఒక్కటే మార్గం. చారిత్రక నేపథ్యం, ఇతివృత్తం కలిగిన స్ఫూర్తిదాయక చిత్రాలకు అడపాదడపా ఆయా ప్రభుత్వాలు పన్నురాయితీ ఇస్తుంటాయి. ఈవిధంగా రాయితీ పొందుతున్న చిత్రాల సంఖ్య ఇటీవల బాగా పెరిగింది. భారత ప్రధాని మోదీ 'స్వచ్ఛభారత్' స్ఫూర్తితో తాజాగా రూపొందిన 'టాయ్‌లెట్... ఏక్ ప్రేమ్‌కథ' చిత్రానికి ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం పన్ను రాయితీ ప్రకటించి ప్రోత్సహించింది. ఇందులో కథానాయిక అత్తారింట్లో 'టాయిలెట్' కోసం పోరాడుతుంది. ఆ తర్వాత హీరో చేయూతతో ఆ పోరాటం ఉద్యమరూపు సంతరించుకుంటుంది. ఈ సందేశం అందరికీ చేరాలనే ఉద్దేశంతోనే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం 'టాయ్‌లెట్' సినిమాను ప్రత్యేకంగా అభినందించడమేగాక పన్నురాయితీ కూడా ఇచ్చింది.

రెండేళ్ల క్రితం అనుష్క ప్రధానపాత్రలో గుణశేఖర్ తీసిన 'రుద్రమదేవి' సినిమాకు తెలంగాణ ప్రభుత్వం పలు రాయితీలు ప్రకటిస్తే, ఈ యేడాది బాలకృష్ణను 'గౌతమిపుత్ర శాతకర్ణి'గా చూపించిన దర్శకుడు క్రిష్‌ను అభినందిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆ సినిమాకు పన్నురాయితీ ఇచ్చింది. హిందీ భాష ప్రాధాన్యతను తెలుపుతూ రూపొందిన ఇర్ఫాన్‌ఖాన్ కామెడీ డ్రామా 'హిందీ మీడియం' సినిమాను ఢిల్లీ, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వాలు టాక్స్‌ఫ్రీ మూవీగా ప్రకటించడంతో బాక్సాఫీసు దగ్గర అది సుమారు 70 కోట్ల రూపాయలు వసూలు చేసింది. ఈ లిస్టులో 'సచిన్' (మహారాష్ట్ర, ఢిల్లీ, కేరళ, ఛత్తీస్‌గఢ్), 'సరబ్‌జిత్', 'దంగల్', 'నీర్జా', 'ఎయిర్‌లిఫ్ట్', 'మాంఝీ', 'బాజీరావ్ మస్తానీ', 'మేరీకోమ్' సినిమాలు కూడా ఉన్నాయి. మంచి సినిమాలకు పన్నురాయితీ ఇస్తున్న రాష్ట్రాల్లో ఉత్తరప్రదేశ్ ముందుండటం విశేషం. అయితే పన్ను రాయితీ ఫలాలు ప్రేక్షకులకు ఇవ్వకుండా (టికెట్ ధరలు తగ్గించకుండా), నిర్మాతలే జేబులో వేసుకుంటున్నారనే విమర్శలూ వెల్లువెత్తుతున్నాయి.




ఫిల్మ్ నగర్






# INSIDE





**గురుభ్యోనమః**

అక్షరాలు దిద్దించిన ఆదర్శ గురువుకు ఓ శిష్య పరమాణువు రాసుకున్న భక్తిపూర్వక లేఖ ఇది. సెప్టెంబర్ 5 - ఉపాధ్యాయ దినోత్సవ ప్రత్యేక కథనం. 7



**బోయపాటి శ్రీను**

హీరోలను మాస్‌గా చూపించే దర్శకుడు బోయపాటి శ్రీను చూడడానికి క్లాస్‌గా కనిపిస్తారు. ఆయనలోని మాస్, క్లాస్ సీక్రెట్స్... వాటి వెనుక ఉన్న ఆసక్తికర విశేషాలు... 12

మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, *రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33*కు, మెయిల్ ద్వారా *sunday.aj@gmail.com*కు పంపండి.












## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ సర్వం శ్రీకృష్ణార్పణం

ఈ వారం కవర్‌స్టోరీ 'పరమాత్మ కృష్ణ- పొలిటికల్ స్ట్రాటజిస్ట్' అద్భుతంగా ఉంది. భారతీయ ఇతిహాసాల్లో మహాభారతానికి ఎంతో విశిష్టమైన స్థానం ఉంది. తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలని పెద్దలు ఏనాడో చెప్పారు. అయితే అందరికీ అర్థంకాని, అర్థం చేసుకోలేని ఆ పరమాత్మలో దాగి ఉన్న ఎన్నో విషయాలను సరళంగా వివరించారు. మంచి విలువను మానవాళికి తెలిపేందుకు అవకాశం ఇచ్చేది ఆయనే! భక్తితో పూజిస్తే కృష్ణుడెప్పుడూ మన వెంటే ఉంటాడు. ఆయనతో పాటే విజయమూ ఉంటుంది. నేటితరానికి ఈ కథనం ఒక విలువైన పాఠం.

**- జి.వి లక్ష్మీనరసింహం,** అమెరికా
**పెద్దింటి శ్రీలక్ష్మి,** యానాం

### ◆ ఏడో మెట్టు ఎక్కినా...

'సెవెన్త్ ఫ్లోర్' కథ సందర్భోచితంగా అనిపించింది. పైకి నీతిమంతులుగా కనబడే కొందరు రాజకీయ నాయకులు, అధికారం నిలబెట్టుకోవడం కోసం ఏ విధంగా అక్రమాలకు పాల్పడతారో వివరించారు రచయిత. గోపాల్రావులాంటి కాంట్రాక్టర్లకు లాభాలు తెచ్చే వ్యాపారం కావాలి, రాజకీయ నాయకులకు అధికారం తెచ్చే ఓట్లు కావాలి, ఓటర్లకు నాయకులు పంచే నోట్లు కావాలి. ఇది మారనంతవరకూ అవినీతి ఉద్యోగుల జేబులు తడుస్తూనే ఉంటాయి.

**- కట్టోజు సాయికిరణ్,** చిలకానగర్

### ◆ రక్షకులు కావాలి !

'క్యాంపస్ జంతురక్షకులు' కథనం చాలా బాగుంది. పర్యావరణం మీద ప్రేమతో, జంతు సంరక్షణకు నడుం బిగించిన 'వైల్డ్ లెన్స్' విద్యార్థి బృందానికి ప్రత్యేక అభినందనలు. ఈ విధంగా విద్యార్థులంతా ఏకమైతే, జంతువుల జోలికి వెళ్లాలంటేనే వేటగాళ్లు భయపడతారు.

**- ఎన్. నరేష్,** నాగార్జునసాగర్

### ◆ అమీతుమీ

'తెలుగు సినిమాల్లో తెలుగు హీరోయిన్లు కనిపించరు' అని బాధపడే వారికి ఆశాకిరణంలా కనిపిస్తోంది ఈషా రెబ్బా. 'అంతకుముందు - ఆ తర్వాత' సినిమాతో మొదలెట్టి, పరభాషా హీరోయిన్లతో 'అమీతుమీ' అంటూ పోటీ పడుతున్న ఈషా, భవిష్యత్తులో ఎన్నో ఉన్నత స్థానాలకు చేరుకుంటుందని ఆశిస్తున్నాం.

**- హేమేష్,** నందికొండ

### ◆ స్టార్ క్లిక్ !

పోస్టర్ల మీద బొమ్మలు చూసి 'ఫోటో అదిరింద'ని అనుకోవడమే కానీ, దాన్ని తీసిన వారి గురించీ, సందర్భం గురించీ ఆలోచించం. స్టార్ హీరోల దగ్గర ఆస్థాన ఫోటోగ్రాఫర్లుగా ఉన్న వ్యక్తులు, వారి ఇష్టమైన ఫోటోల కబుర్లు చాలా బాగున్నాయి.

**- సత్యప్రదీప్,** ఒంగోలు

# ఏ వయసులో... ఎందులో బెస్ట్!

ఎవరైనా, వయసెంతని అడిగితే... రెండు మూడేళ్లు తక్కువే చెబుతాం. 'చిన్నవయసే' అనిపించుకోవాలని ఆశ. తక్కువ వయసు వారిలోనే... వేగం ఎక్కువనీ, సృజన అపారమనీ ఓ నమ్మకం. అదంతా అపోహే అంటున్నాయి తాజా అధ్యయనాలు. కొన్ని పనుల్ని పాతికేళ్ల వయసులో సరిగా చేయలేం. అదే ఎనభైలలో అద్భుతంగా చేయగలం. అలాగే 30 ఏళ్ల వయసుకు కష్టంగా అనిపించింది... ఏడేళ్ల పసి ప్రాయంలో మహా సులువు! ఏ వయసులో మనం ఏ పనిని అత్యుత్తమంగా చేయగలమన్నది నిపుణులు నిర్ధారించారు. ఏ వయసులో కొత్త భాష త్వరగా నేర్చుకోగలం? ఏ వయసులో చదరంగం బాగా ఆడగలం? ఏ వయసులో లెక్కలు బాగా చేయగలం? అసలు సంతృప్తితో ఆనందంగా బతికే వయసు ఏది?... వీటిన్నింటికి సమాధానం మీరే తెలుసుకోండి.

**7** కొత్త భాష నేర్చుకోవడం

**18** మెదడులో పూర్తిస్థాయి చురుకుదనం

**22** ఎక్కువ పేర్లు గుర్తుంచుకోగల శక్తి

**23** జీవితం పట్ల మహా సంతృప్తి

**25** అపారమైన కండరాల సత్తువ

**26** జీవిత భాగస్వామిని ఎంచుకునే నైపుణ్యం

**28** మారథాన్ పరుగులో పాల్గొనే సత్తువ

**30** తిరుగులేని ఎముకల పటిష్ఠత

**31** చదరంగంలో మహామహా ఎత్తులు వేయగల శక్తి.

**32** ఎక్కువ మొహాల్ని గుర్తుంచుకోగల జ్ఞాపకశక్తి

**40** నోబెల్ బహుమతి స్థాయి ఆవిష్కరణలు చేయగల సృజన

**50** లెక్కలు బాగా చేయగల పదును

**51** ఎదుటివారి భావోద్వేగాలను అర్థం చేసుకోగల మానసిక పరిపక్వత.

**71** పత్రికల్లో వచ్చే పజిల్స్, సుడోకుల పట్ల ఆసక్తి

**69** జీవితం పట్ల మరింత సంతృప్తి



దైవమ్

# మహోన్నత సందేశం... వామనావతారం!

**మనిషి ఆచరించాల్సిన ధర్మం ఒకటుంది. అదే సత్యం. సత్యాన్ని ఆధారం చేసుకొనే జగత్తంతా నడుస్తోంది. అన్ని అనర్థాలకూ కారణం సత్యం తప్పటమే. అన్ని విజయాలకూ మూలం సత్యధర్మాన్ని పాటించడమే. ఆ వేద సందేశాన్ని మానవాళికి తెలియజెప్పేందుకే శ్రీమహావిష్ణువు వామనుడుగా అవతరించాడు. సెప్టెంబర్ 3న వామన జయంతి.**

**భా**ద్రపద శుద్ధ ద్వాదశి నాడు వామనుడు అవతరించాడు. ఆ అవతారానికి ఓ గొప్ప నేపథ్యం ఉంది. దేవేంద్రుడు ధర్మబద్ధంగా అమరావతిని పాలిస్తూ ఉండేవాడు. కానీ, దానవ పక్షంలో ఉన్న బలి చక్రవర్తి ఇంద్రుడి మీద వైరంతో యుద్ధానికి దిగాడు. ఆ పోరాటంలో మరణించాడు కూడా. బలి చక్రవర్తి గురువు అయిన శుక్రాచార్యుడు తన దగ్గరున్న మృతసంజీవని విద్యతో బలిని బతికించి యుద్ధానికి కావలసిన శంఖం, ఇతర శక్తులను ప్రసాదించి ఇంద్రుడి మీదకు పంపాడు. శుక్రాచార్యుడిచ్చిన శంఖాన్ని అమరావతి ముట్టడిలో పూరించాడు బలి చక్రవర్తి. ఆ శబ్దానికే స్వర్గవాసులంతా చైతన్యం కోల్పోయారు. ప్రళయాగ్నిలా భయపెడుతున్న బలిని చూసి గజగజలాడిపోయారు. మాయా రూపాల్లో తలా ఒక దిక్కుకు పారిపోయారు. బలి చక్రవర్తి స్వర్గ సింహాసనాన్ని ఆక్రమించి పాలించసాగాడు.

### బిడ్డల కోసం...

దేవమాత అదితి. ఆమె భర్త కశ్యప ప్రజాపతి. బలి చక్రవర్తి స్వర్గాన్ని ఆక్రమించిన సమయంలో కశ్యపుడు తపస్సు కోసం ఎక్కడో ఉన్నాడు. అదితి తన బిడ్డలకు జరిగిన అన్యాయానికి బాధపడుతూ భర్త రాక కోసం ఎదురుచూసింది. ఆయన రాగానే అంతా వివరించి, తమ సంతానం మళ్లీ స్వర్గాన్ని ఆక్రమించుకొనే మార్గాన్ని చెప్పమని వేడుకొంది. కశ్యపుడు దివ్యదృష్టితో జరిగిందంతా తెలుసుకున్నాడు. పరిస్థితి చక్కబడటానికి ఒకే ఒక్క మార్గముందనీ బ్రహ్మదేవుడు తనకు స్వయంగా తెల్పిన పయోవ్రతాన్ని ఆచరించాలనీ చెప్పాడు. ఆ వ్రతాన్ని చేస్తే శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై కష్టాలను తీరుస్తాడన్నాడు. వ్రతవిధానాన్నీ, నియమనిష్ఠలనూ కూడా భార్య అదితికి వివరించాడు. దేవమాత భర్త చెప్పిన విధంగా వ్రతం చేసింది. శ్రీమహావిష్ణువు ఎంతో ఆనందించి ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు. ఆ తల్లి తన మనసులోని మాట చెప్పింది. దాంతో విష్ణువు తానే తన అంశతో అదితి గర్భాన జన్మిస్తాననీ, ఆ అంశావతారంతోనే మేలు చేస్తాననీ మాటిచ్చి అంతర్ధానమయ్యాడు. అదితి ఆనందించింది.

అదితికి నెలలు నిండి ప్రసవ సమయం వచ్చింది. భాద్రపద శుక్ల ద్వాదశి నాడు శ్రవణ నక్షత్రంలో గ్రహ నక్షత్ర తారకలు శుభస్థానంలో ఉన్నప్పుడు మిట్టమధ్యాహ్నం అభిజిత్ ముహూర్తాన సకల అలంకారాలతో జన్మించాడు విష్ణుమూర్తి. అలా జన్మించిన కొద్దిసేపటికే తన నిజస్వరూపాన్ని ఉపసంహరించుకున్నాడు. కశ్యపుడు మహర్షులను పిలిపించి జాతకర్మలు చేయించాడు. అలా వామనుడుగా శ్రీమహావిష్ణువు పేరు పొంది, పెరిగి పెద్దవుతున్నప్పుడు... తగిన సమయంలో ఉపనయనాది సంస్కారాలను జరిపించాడు కశ్యపుడు.



### స్వరూప సౌందర్యం

ఉపనయనం అయిన వెంటనే, నర్మదానదికి ఉత్తర తీరంలో యజ్ఞం చేస్తున్న బలి చక్రవర్తి దగ్గరికి వెళ్లాడు వామనుడు. రాక్షస గురువు శుక్రాచార్యుడు అగ్నితో ఎదురెళ్లి మర్యాదపూర్వకంగా లోపలికి ఆహ్వానించాడు. బలి చక్రవర్తి తగిన ఆసనాన్ని సమర్పించి కాళ్లు కడిగి శిరస్సున చల్లుకున్నాడు. ఏమి కోరినా ఇస్తానని వినయపూర్వకంగా మాటిచ్చాడు. అప్పుడు వామనుడు... తనకు వేరే ఏమీ అక్కర్లేదనీ, మూడడుగుల నేల మాత్రం చాలనీ అన్నాడు. వామనుడి మాటలు బలి చక్రవర్తికి ఎంతో ఆనందాన్ని కలిగించాయి. వెంటనే మూడడుగుల నేలను దానం ఇచ్చేందుకు అన్ని ఏర్పాట్లూ చేశాడు. అదంతా శుక్రాచార్యుడు గమనిస్తూనే ఉన్నాడు. బలి చక్రవర్తిని దానం ఇవ్వకుండా ఆపడానికి ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలుడయ్యాడు. చివరకు, దానవులకు శత్రువైన శ్రీమహావిష్ణువే వామనుడుగా వచ్చాడనీ, ఆయనడిగిన దానమిస్తే ఎంతో నష్టపోవలసి వస్తుందనీ హెచ్చరించాడు. అయినా బలి పట్టించుకోలేదు. అదీకాక ఆ వచ్చింది సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే అయినప్పుడు, ఆయన చెయ్యి కిందా, నా చెయ్యి పైనా అవ్వటం కన్నా ఏం కావాలన్నాడు. ఓ స్థిర నిర్ణయానికొచ్చి మూడడుగుల నేలను దానమిచ్చాడు. దానాన్ని గ్రహించిన వెంటనే మరుగుజ్జు రూపంలో ఉన్న ఆ వామనుడు 'ఇంతింతై వటుడింతయై..' అన్నట్టు ఒక అడుగుతో బ్రహ్మాండాన్ని, మరో అడుగుతో భూమిని ఆక్రమించాడు. మూడో అడుగుగా తన శిరసు మీద ఉన్న స్థలాన్నే గ్రహించమన్నాడు బలి చక్రవర్తి. అలా వామనుడు త్రివిక్రముడు అయ్యాడు. కానీ బలి చక్రవర్తిలోని సత్యధర్మపాలన శ్రీమహావిష్ణువును ఎంతగానో ఆకట్టుకుంది. ప్రస్తుతం బలి చక్రవర్తి అహంకారభావనతో ఉన్నాడనీ అది ధర్మబద్ధం కాదు కనుకనే, వామన అవతారం జరిగిందనీ చెప్పాడు. ఎనిమిదవ మనువైన సావర్ణి మన్వంతరంలో బలి చక్రవర్తి ఇంద్ర పదవిని పొందుతాడని ఆనతిచ్చాడు. అప్పటిదాకా విశ్వకర్మ నిర్మించిన సుతలం అనే లోకం బలికి నివాసమవుతుంది, అక్కడ అన్ని శుభాలు, సుఖాలు సమకూరుతాయని అనుగ్రహించాడు త్రివిక్రముడు.

వామన వ్రతాచరణ విషయానికొస్తే ద్వాదశికి ముందు వచ్చే ఏకాదశి నాడు ఉపవాసం ఉండి ఆ రాత్రి జాగారం చేస్తారు. వామన రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువు రూపాన్ని భక్తిపూర్వకంగా అర్చిస్తారు. వామనావతార కథను దైవారాధన సమయంలో పఠిస్తారు. త్రివిక్రమ పరాక్రమాన్ని స్మరిస్తారు. ఇలా చెయ్యటం వల్ల నిత్య సౌఖ్యాలు కలుగుతాయన్నది తరతరాలుగా వస్తున్న భక్తుల విశ్వాసం.

- **శ్రీమల్లి,** 73829 27069

# ఒంటరిగా ఉంటున్నాడు...?



**మా అబ్బాయి ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఎప్పుడూ ఒంటరిగానే గడపాలనుకుంటాడు. తానొక పనికిరానివాడినని బాధపడుతూ ఉంటాడు. స్నేహితులున్నారు కానీ, కావాలని వారిని దూరం పెడుతుంటాడు. వాడు మిగతా పిల్లల్లాగే సంతోషకరమైన జీవితాన్ని గడిపే అవకాశం లేదా?**

**- సుధాకర్‌నాయుడు, గుంటూరు**

అబ్బాయి ఇంజనీరింగ్ చదువుతున్నాడంటే తప్పకుండా అర్థం చేసుకునే స్థాయిలో ఉన్నట్టే. అయితే ఏ విషయంలో తాను పనికిరానివాడని అనుకుంటున్నాడో తెలియాలి. అతడికి ఏమైనా ఇతర భయాలున్నాయా? వేటితో కంఫర్ట్‌గా ఉండలేకపోతున్నాడు? స్నేహితులతో సమానంగా ఉన్నానని ఎందుకు భావించలేకపోతున్నాడు? అనే విషయాలు ఇక్కడ ముఖ్యం. సాధారణంగా స్నేహితులకు సంబంధించి ఏమవుతుందంటే- గ్రూపులో ఎవరైనా సున్నితంగా ఉంటే వారినే ఎక్కువగా టీజ్ చేస్తుంటారు. తన బలహీనతలను ఎదుటివారి ముందు ప్రదర్శించడం వల్ల వాళ్లు కూడా అడ్వాంటేజ్‌గా తీసుకుంటారు. అలాంటి సమస్యలేమైనా అబ్బాయి ఎదుర్కొంటున్నాడా అనేది కూడా చూడాలి. సమస్యలకు జడిసి పారిపోకుండా, ధైర్యంగా నిలబడే స్థయిరాన్ని కూడగట్టుకోవాలి. ముందుగా సమస్యను సానుకూలంగా విని, దానికి పరిష్కారాన్ని అర్థమయ్యేలా వివరిస్తే ప్రయోజనం ఉంటుంది.




**మా ఎదురింటి అబ్బాయి ఇంటర్మీడియెట్ చదువుతున్నాడు. అంత చిన్న వయసులోనే ఎవరో అమ్మాయిని ప్రేమిస్తున్నాడట. అతడి తీరు చూసి తల్లిదండ్రులు బాధపడుతున్నారు. పిల్లాడు ఏమైపోతాడో అని భయపడుతున్నారు. టీనేజ్‌లోనే పిల్లలకు ప్రేమంటే ఏమిటో తెలుస్తుందా?**

**- సుమిత్ర, కాశీబుగ్గ**

ఇంటర్మీడియెట్ అంటే 16 ఏళ్లుంటాడు. ఈ వయసులోని పిల్లలు ఒకరిని ఇష్టపడ్డారంటే తప్పకుండా అది ఆకర్షణే అవుతుంది దాన్ని ప్రేమ అనలేం. సాధారణంగా ఈ వయసు పిల్లలు తమ ఇష్టాయిష్టాలు, అభిరుచులు ఎదుటివారిలోనూ ఉంటే చాలు వారిని ఇష్టపడటం మొదలెడతారు. దాన్నే ప్రేమ అనుకుంటారు. తల్లిదండ్రులు పిల్లల కోసం సమయం కేటాయించకపోవడం, వారిని ప్రేమగా దగ్గరికి తీయకపోవడం వల్ల... సహజంగానే బయటి ప్రేమల వైపు మొగ్గుచూపుతారు. ప్రేమకు పెద్ద ప్రాసెస్ ఉంటుంది. ఒకరినొకరు అర్థం చేసుకోవడం, అభిప్రాయాలను గౌరవించుకోవడం వంటివి చాలా ఉంటాయి. అది శారీరక ఆకర్షణలకు అతీతంగా ఉంటుంది. సాధారణంగా టీనేజర్లకు ఎలాంటి సలహాలిస్తామంటే... ఇతరులతో (అంటే అమ్మాయైనా, అబ్బాయైనా) స్నేహంగా ఉండండి (ఒక్కోసారి ఆ స్నేహం రిలేషన్‌షిప్ వైపు కూడా వెళ్లొచ్చు అది వేరే విషయం). స్నేహంలో నమ్మకం, పారదర్శకత ఉండాలి. అబద్ధాలు, అపనమ్మకాలు స్నేహానికి ఆటంకాలు సృష్టిస్తాయి. ఆ స్నేహాన్ని కాపాడుకుంటూ వెళ్తే ఆ తర్వాత ప్రేమ గురించి తెలుస్తుంది.

**మాకు 15 ఏళ్ల అబ్బాయి ఉన్నాడు. అతడికి ఈటింగ్ డిజార్డర్ ఉంది. ఎప్పుడూ మానసికంగా కుంగిపోతూ తనను తానే శిక్షించుకుంటాడు. అన్నింటికీ విపరీతమైన ఒత్తిడికి గురవుతూ, ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తుంటాడు. రెండుసార్లు ఆత్మహత్యాయత్నం కూడా చేశాడు. ఈ ధోరణి నుంచి బయటపడేయలేమా?**

**- రాజేశ్వరి, అనంతపురం**

మీరు చెబుతున్నదాన్ని బట్టి చూస్తే పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉందని అర్థమవుతోంది. ఆత్మహత్యాప్రయత్నం కూడా చేశాడు కాబట్టి అబ్బాయిని ఒంటరిగా ఉండనివ్వకండి. అతడిని వెంటనే సైకియాట్రిస్టు దగ్గరికి తీసుకెళ్లండి.

పిల్లాడి మానసిక స్థితిని అంచనా వేసి... ఒత్తిడిని పోగొట్టుకోవడానికి, కోపాన్ని కంట్రోల్ చేసుకోవడానికి అవసరమైన చికిత్స అందిస్తారు. మెడికేషన్‌తో పాటు థెరపీ క్లాసులు అతడికి ఉపయోగపడతాయి. అందులో నుంచి బయట పడిన తర్వాత మీరేం చేయాలో చెబుతారు.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com



కవర్ స్టోరీ

# గురుభ్యో నమః

**అక్షరాలు దిద్దించి, అక్షరాలా జీవితాన్నిచ్చిన గురువుకు... చూచిరాత నేర్పించి, తలరాతనూ మార్చిన ఉపాధ్యాయుడికి... తప్పులు లేకుండా సెలవుచీటీ రాయించి, జీవితంలో తప్పక నెగ్గుకొస్తావని సిఫార్సులేఖ ఇచ్చిన మాస్టారుకు ఓ విద్యార్థి ప్రేమ పూర్వకంగా రాసుకున్న ఉత్తరం....**

(సెప్టెంబర్ 5, ఉపాధ్యాయ దినోత్సవం)

నమస్కారం మాస్టారూ...
బావున్నారా?
ఆరోగ్యం ఎలా ఉంది?
అమ్మగార్ని అడిగినట్టు చెప్పండి.
పిల్లలెలా ఉన్నారు?

మీ చిరునామా కోసం చాలా రోజులుగా ప్రయత్నిస్తున్నా. విజయవాడలో ఉన్నారని ఎవరో చెప్పారు. కాదుకాదు, వరంగల్లులో స్థిర పడ్డారని ఇంకెవరో చెప్పారు. రెండూ అబద్ధమే, విదేశాల్లోని పిల్లల దగ్గరికి వెళ్లిపోయారని మరెవరో అన్నారు. ఎవరిమాట నమ్మాలో అర్థం కాలేదు. చేసేదేమీ లేక ఆశ వదులుకున్నా. ఈమధ్యే మేం పూర్వ విద్యార్థుల సంఘం ఏర్పాటు చేసుకున్నాం. మాకో ఫేస్‌బుక్ గ్రూప్ ఉంది. పాత విషయాల్ని నెమరేసుకుంటూ ఉంటాం. అప్పుడే, మీ ప్రస్తావన వచ్చింది. మీరెక్కడున్నారో తెలుసుకునే ప్రయత్నమూ మొదలైంది. ఎలాగోలా మీ చిరునామా సంపాదించాను. ఇంకాస్త కష్టపడితే ఫోన్ నంబరూ చేతికొచ్చేదే. కానీ, అక్షరాలు దిద్దించిన మీతో... అక్షర ముఖంగా మాట్లాడాలని నా కోరిక. అందుకే, కలమూ కాగితమూ ముందేసుకుని కూర్చున్నా. ఎలా ప్రారంభించాలా అని ఆలోచిస్తుంటే, గోడమీద ఐన్‌స్టీన్ బొమ్మ కనబడింది. 'గాంధీజీ లాంటి వ్యక్తి మన మధ్య ఉండేవారంటే రేపటి తరాలు విశ్వసించవేమో' అనేవారట ఐన్‌స్టీన్. అదే మాట మీకూ వర్తిస్తుంది. మీలాంటి ఉపాధ్యాయుల అంకిత భావం గురించి చెబితే, ఈతరం టీచర్లు ఓపట్టాన నమ్మరేమో! బడే మీ ప్రపంచం. పిల్లలే మీ లోకం. ఉపాధ్యాయ వృత్తిని ఓ ఉద్యోగంలానో, ఉపాధిమార్గంగానో మీరెప్పుడూ భావించలేదు. జానాబెత్తెడు జీతంతో గంపెడు సంసారాన్ని ఎలా నెగ్గుకొచ్చేవారో? ఆ బరువూ బాధ్యతా బయటికి తెలియనిచ్చేవారు కాదు. ఒకటో తేదీన అయినా నెలాఖరున అయినా... అదే ప్రసన్నవదనం, అంతే గాంభీర్యం! తెలుగు తలకట్టులా మీరు తలెత్తుకుని నడుస్తుంటే... ఉపాధ్యాయవృత్తిలోని హుందాతనమంతా మీలోనే కనిపించేది. తెల్లటి ఖద్దరు దుస్తుల్లో ... చదువులతల్లి పెంపుడు హంస, పొరపాటున మనిషై పుట్టిందేమో అన్నట్టుగా ఉండేవారు. ఎందుకో, కాళ్లకి చెప్పులు మాత్రం వేసుకునేవారు కాదు. 'పిసినారి మాస్టారు. చెప్పులు కూడా కొనుక్కోరు', 'ఎవరైనా ఎత్తుకెళ్తారని భయంకాబోలు'... అంటూ ఆకతాయి కుర్రాళ్లు మీగురించి చులకనగా మాట్లాడేవాళ్లు. ఆ మాటలు వింటున్నప్పుడు చాలా బాధనిపించేది. ఉండబట్టలేక ఆ రౌడీ వెధవలతో గొడవ పడిన సందర్భాలూ ఉన్నాయి. ఓరోజు ధైర్యం చేసి మిమ్మల్నే అడిగేశాను. 'గుడికి వెళ్తున్నప్పుడు వేసుకుంటామా? బడికెళ్తున్నప్పుడు మాత్రం ఎందుకు? బడి కూడా గుడే. చదువులమ్మ గుడి...' అంటూ మీరిచ్చిన సమాధానాన్ని ఎలా మరచిపోగలను. ఆ మాటలు నేరుగా నా బుద్ధిని తాకాయి. చెప్పులతో బడికెళ్లడం అదే చివరి రోజు. యూనివర్సిటీ విద్యార్థిగానూ ఆ నియమాన్ని పక్కనపెట్టలేదు. హాస్టలు నుంచి ఆర్ట్స్ బిల్డింగ్‌కు వెళ్లేసరికి కాళ్లు బొబ్బలెక్కేవి. అలాంటప్పుడు, చిత్తం చెప్పుల మీదికి మళ్లేది. అదీ క్షణికమే. అంతలోనే మీరు చెప్పిన ఓ కథ గుర్తుకొచ్చేది.

అనగనగా ఓ గురుకులం. ఓ పాతికమంది పిల్లలు విద్య నేర్చుకునేవారు. గురుపత్ని ఆ పిల్లల్ని సొంత బిడ్డల్లా చూసుకునేవారు. కడుపునిండా భోజనం పెట్టేవారు. తొందర్లోనో, మతిమరుపుకొద్దో రోజూ నేతికి బదులుగా ఆముదం వడ్డించేవారు. విద్యార్థులకూ ఆ తేడా తెలిసేది కాదు. ఓరోజు మాత్రం అందర్లోకీ కాస్త పెద్దవాడైన పిల్లాడు, 'అమ్మగారూ! ఇది నెయ్యి కాదు, ఆముదం...' అని చెప్పేశాడు. ఆతర్వాత, గురువుగారు వాడిని దగ్గరికి పిలిచి 'ఆముదానికీ ఆవునెయ్యికీ తేడా తెలుసుకున్నావంటే... నీ చదువు అయిపోయినట్టే లెక్క. ఇంటికెళ్లిపోవచ్చు' అని చెప్పారు. 'లౌకిక విషయాల పట్ల ఆసక్తి పెరిగితే, చదువు మీద గురి తగ్గినట్టే. ఇక ఎంత చదివినా ప్రయోజనం ఉండదు. అందుకే గురువుగారు ఆ మాట చెప్పారు'.. అంటూ మీరు ముక్తాయించేవారు. ఆ మాటలు గుర్తుకురాగానే మీ రూపం కళ్లముందు మెదిలేది. మిమ్మల్ని తలుచుకోగానే... ఎండలో ఏం ఖర్మ, నిప్పుల్లోనూ నడిచే ధైర్యం వచ్చేది.

• • •

మీ పాఠం నదీ ప్రవాహం. ఎన్ని కథలూ, ఎన్ని ఉపకథలూ, ఎంత సాహితీ పరామర్శ,

ఎంత సద్విమర్శ, ఎన్ని చణుకులు, ఎన్ని మెరుపులు! ఎంత రాజనీతి, ఎంత లోకరీతి! ఆ సమయంలో మీరు తపస్సులో ఉన్న రుషి, అగ్ని ముందు కూర్చున్న రుత్విజుడు! ఆ నలభై అయిదు నిమిషాలూ... గుర్రాన్ని పగ్గంతో కట్టేసినట్టు... విద్యార్థి ఆలోచనలు పాఠాన్ని దాటి పక్కకి వెళ్లేవి కాదు. శాకుంతలమైతే శకుంతల, మనుసంభవమైతే వరూధిని, పారిజాతాపహరణమైతే సత్యభామ, వాల్మీకం అయితే శ్రీరామ చంద్రుడు... విద్యార్థి కళ్లముందు మెదలాల్సిందే. పేరుకు తెలుగు మాస్టారే అయినా, ఆంగ్లంలోనూ మీ ప్రతిభ అసాధారణమే. సూరన్న కళాపూర్ణోదయాన్ని షేక్స్‌పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'తో పోల్చేవారు. మహాభారత ఘట్టాల్ని బైబిలు కథలతో ముక్తాయించేవారు. విదురనీతిని వివరిస్తూ ఖొరాన్ సూక్తుల్నీ ఉటంకించేవారు. పల్లె పొలిమేరలు కూడా దాటని పంచెకట్టు పెద్దమనిషి ఇంత ప్రపంచాన్ని ఎప్పుడు చూశారా? - అనుకునేవాడిని అజ్ఞానం కొద్దీ. మహాభారతాన్ని 'ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మ విదులు వేదాంతమని, నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని...' కొనియాడితే కొనియాడవచ్చు కానీ, మాకు సంబంధించినంత వరకూ మీ పాఠాలే పంచమహా కావ్యాలూ, అష్టాదశ పురాణాలూ, అపౌరుషేయాలూ! కాబట్టే, ఇన్నేళ్ల తర్వాత కూడా... ఏ స్టీఫెన్ కవే పుస్తకాన్నో, రాబిన్‌శర్మ గ్రంథాన్నో తిరగేస్తుంటే నాకు కొత్తగా ఏం అనిపించదు. అటూ ఇటుగా మీరు చెప్పిన విషయాలే ఉంటాయి. కాకపోతే... కాస్తంత పదాడంబరం, కించిత్ స్వోత్కర్ష! మీకేమో, పేరుకు ముందు 'ఉభయ భాషా ప్రవీణ' అన్న మాట రాసుకోడానికి కూడా మొహమాటమే.

...కాదుకాదు. అది, నిరాడంబరత్వం.

• • •

మీకు గుర్తుండే ఉంటుంది. ఓసారి మన బడికి ఎమ్మెల్యేగారొచ్చారు, కొత్తగా కడుతున్న అదనపు గదుల్ని తనిఖీ చేయడానికి అనుకుంటా. మిగతా ఉద్యోగులంతా పరుగు పరుగున వెళ్లి కాళ్లమీద పడినంత పనిచేశారు. మీరు మాత్రం ఎత్తిన తల దించలేదు. చేతిలోని హాజరు పుస్తకమూ రూళ్లకర్రా పక్కనపెట్టలేదు. చాలా హుందాగా... 'రండి, కులాసానా...' అంటూ పలకరించారు. ఆ ఆత్మీయత ఆయనకు అహంభావంలా అనిపించింది. విసవిసా వెళ్లిపోయారు. మరుసటిరోజు సాక్షాత్తు డీయీవో దొరగారే రంగంలోకి దిగారు. 'మీరు నమస్కారమైనా పెట్టకుండా ఎమ్మెల్యేగార్ని అవమానించినట్టు ఫిర్యాదు అందింది. సంజాయిషీ ఏమిటి?' అని అడిగారు గుర్రున చూస్తూ. తొణక్కుండా బెణక్కుండా మీరిచ్చిన సమాధానం ...'నా బళ్లో వందమందికిపైగా పిల్లలున్నారు. వాళ్ల దృష్టిలో నేను చాలా శక్తిమంతుడిని. ఆ భయంతోనే నా ఆదేశాల్ని పాటిస్తారు. నేనే మరొకరికి భయపడతానని తెలిస్తే... నా మీద గౌరవం తగ్గిపోతుంది. మునుపట్లా క్రమశిక్షణతో మెలగలేరు. ఆ ప్రభావం చదువుల మీదా పడుతుంది. అది నాకు ఇష్టం లేదు. ఎమ్మెల్యేగారి సంతోషం కోసం, నా విద్యార్థుల భవిష్యత్తును పణంగా పెట్టలేను'.

డీయీవోగారు తలగోక్కుంటూ తిరిగెళ్లిపోయారు. ఆర్నెల్ల తర్వాత మళ్లీ ఎమ్మెల్యేగారు మన బడికొచ్చారు. ఈసారి పాఠశాల వార్షికోత్సవానికి ముఖ్య అతిథిగా. సభ ప్రారంభమయ్యే సమయానికి.... వేదిక మీద రెండే కుర్చీలు ఉన్నాయి. ఒకటి ఎమ్మెల్యేగారికి, రెండోది జిల్లా విద్యాధికారికి. 'ఏ బడికి అయినా ప్రధానోపాధ్యాయుడే ప్రాణం. ఆయన లేని వేదిక మీద నేనూ కూర్చోను' అంటూ ఎమ్మెల్యేగారు దిగెళ్లబోయారు. గ్రామ పెద్దలంతా, బతిమాలి వెనక్కి తీసుకొచ్చారు. మూడంటే మూడు నిమిషాల్లో మూడో కుర్చీ ఏర్పాటు చేశారు. మీరు వేదిక ఎక్కగానే, 'క్షమించండి మాస్టారూ! ఆరోజు అహంకారంతో, అజ్ఞానంతో....' ఉద్వేగంలో ఆయన నోట్లోంచి మాటలు రాలేదు... జలజలా కన్నీళ్లు! కన్నీళ్లతో పాటు అహంకారమూ కరిగి పారింది. ఒక్క మాటైనా మాట్లాడకుండా, కఠినాత్ముడైన ఆ ఎమ్మెల్యేను ఎలా మార్చారు మాస్టారూ?

• • •

హెడ్మాస్టరుగారు ఎన్నింటికి బడికొస్తారు?- అన్న ప్రశ్నకు జవాబు తెలుసుకోడానికి ఎన్ని తంటాలు పడ్డామో. ఎన్ని పందాలు వేసుకున్నామో! ఎంత తొందరగా వచ్చామనుకున్నా, అప్పటికే మీరు ఆవరణంతా కలియతిరుగుతూ కనిపించేవారు. ఎక్కడ ఏ చిన్న కాగితం ముక్క పడున్నా, తీసుకెళ్లి పడేసేవారు. అది చూసి, ఆ చెత్త వేసిన కుర్రాడు సిగ్గుతో తలదించుకునేవాడు. ఇక జన్మలో ఆ తప్పు చేసేవాడు కాదు. మధ్యాహ్నం పన్నెండున్నరకంతా పెద్ద బంట్రోతు మీ ఇంటి నుంచీ భోజనం తీసుకొచ్చేవాడు. కాదు కాదు... మోసుకొచ్చేవాడు. ఐదారు గిన్నెలతో వినాయకుడి విగ్ర












## వంతెన కింద బడి

మురికివాడల పిల్లల్ని చూసిన ప్రతిసారీ రాజేశ్‌కుమార్‌జీ గుండె తరుక్కుపోయేది. ఎవర్ని తప్పుపట్టాలి? అమ్మానాన్నలదేమో బతుకు పోరాటం. తెల్లారేసరికి పనులకు బయల్దేరిపోతారు. ఆ ఇరుకిరుకు ఇళ్లలో పసివాళ్లే మిగుల్తారు. చీకటిపడే దాకా వీధుల్లోనే కాలక్షేపం. ఆ అంతులేని స్వేచ్ఛ కొన్నిసార్లు పక్కదారి పట్టిస్తుంది. ఆ పరిస్థితి రాకూడదంటే... వాళ్లను బడికి పరిచయం చేయాలి. కానీ, పరిసరాల్లో ఎక్కడా అక్షరాల సందడి కనిపించదే! మరోదార్లేక, తనే ఓ పాఠశాలను ప్రారంభించాలనుకున్నారు. విద్యాసంస్థ అంటే మాటలా? భవనం కావాలి, ఫర్నిచర్ ఉండాలి, సిబ్బందిని నియమించుకోవాలి. అంత స్థోమత తనకు లేదు. దీంతో, ఢిల్లీ మెట్రో వంతెన కిందున్న కొద్దిపాటి ప్రదేశాన్నే పాఠశాలగా మలుచుకున్నారు. ఓ కుర్చీ, నల్లబల్ల, ఒకట్రెండు చాపలు.. ఇవే అతడి యావదాస్తీ! పొద్దున్నే ఆ సరంజామాతో వచ్చేస్తారు. సాయంత్రం మళ్లీ చుట్టేసుకుని వెళ్లిపోతారు. ప్రస్తుతం ఆ 'వంతెన కింద బడి'లో రెండొందలమంది చదువుతున్నారు. స్వచ్ఛంద ఉపాధ్యాయులు ఆయనకు సహకరిస్తున్నారు.

## కోరికోరి మారుమూల పల్లెకి...

మహారాష్ట్రలోని ఓ కుగ్రామం పేరు లోన్వాడి. అక్కడ పని చేయడానికి ఏ ప్రభుత్వోద్యోగీ ఇష్టపడడు. పొరపాటున నియమించినా, ఏ ఎమ్మెల్యేనో, మంత్రినో పట్టుకుని బదిలీ చేయించుకుంటారు. ఓ యువకుడు మాత్రం కోరికోరి అక్కడికే వేయించుకున్నాడు. అతడి పేరు పరశురామ్ నర్వాడే. పాఠ్య పుస్తకంలోని విషయాల్ని వల్లెవేయించి, గంటకొట్టగానే ఇంటికెళ్లిపోయే రకం కాదాయన. ఆయన దృష్టిలో ప్రకృతిని మించిన పాఠం లేదు. పచ్చని కోనలోకి తీసుకెళ్లి... మట్టి గురించీ, నీటి గురించీ, వాతావరణం గురించీ సోదాహరణంగా బోధిస్తారు. అదే సైన్సు పాఠం. అడవిలో దొరికిన విత్తనాల్నీ ఏటి ఒడ్డున ఏరిన గులకరాళ్లనీ కుప్పగాపోసి లెక్కించమంటారు. అదే లెక్కల పాఠం. జానపదులు పాడుకునే పాటలూ, చెప్పుకునే సామెతలూ భాషా పాఠం. ఓ స్వచ్ఛంద సంస్థ సాయంతో... గ్రామంలోని సమస్యల మీదా పోరాడుతున్నారు. ఇంటికో టాయిలెట్ నిర్మాణాన్ని ప్రోత్సహిస్తున్నారు. విద్యుత్ తీసుకొచ్చారు. రోడ్లు వేయించారు. తాజాగా, నర్వాడే బదిలీకి దరఖాస్తు చేసుకున్నట్టు సమాచారం. ఈసారి, లోన్వాడి కంటే మరింత వెనుకబడిన పల్లెకి!

హంలా నిండుగా ఉండేదా ఇత్తడి క్యారేజీ! దాన్ని కనుక చూస్తే, కొత్తవాళ్లెవరైనా మిమ్మల్ని భోజనప్రియుల కింద లెక్కగట్టేస్తారు. నిజానికి మీకు, తిండి మీద పెద్దగా మమకారం ఉండేది కాదు. అందులోనూ మీది ఏకభుక్తం. అదీ మితాహారమే. రోజూ భోజనం గంట కొట్టగానే... పిల్లల వెనకాలే మైదానంలోకి వచ్చేవారు. 'సహనాభవతు...' శాంతిమంత్రం చదివించాకే భోంచేయడానికి అనుమతి ఇచ్చేవారు. ఒక్క మెతుకు కూడా కింద పడకుండా తినాలని చెప్పేవారు. తింటున్నప్పుడు, ప్రతి విద్యార్థినీ గమనిస్తూ వెళ్లేవారు. సగం గిన్నెలో, ఖాళీ గిన్నెలో కనిపిస్తే మాత్రం... ఓ క్షణం మీ చూపులు అక్కడ ఆగేవి. నేరుగా ఆఫీసు గదిలోకి వెళ్లిపోయేవారు. ఓ ఐదు నిమిషాల తర్వాత బంట్రోతు వచ్చి... ఫలానా విద్యార్థిని ఉన్నపళంగా తీసుకురమ్మన్నారని ప్రకటించేవాడు. వణికిపోతూ ఆ కుర్రాడు మీ ముందు నిలబడేవాడు. 'వాడికి భోజనం వడ్డించు' అని బంట్రోతును పురమాయించి, బయటికి వెళ్లిపోయేవారు. మీరు ఎదురుగా ఉంటే, పిల్లలు భయంతోనో మొహమాటంతోనో కడుపునిండా తినరేమో అన్న ఆలోచన.

కొన్నిసార్లు నలుగురైదుగురికి కూడా పిలుపు వచ్చేది. అలాంటి సమయాల్లో అన్ని గిన్నెలూ ఖాళీ అయిపోయేవి. మీకేమీ మిగిలేది కాదు. లోటా నిండా మజ్జిగ తాగి, పన్లో మునిగిపోయేవారు. 'మీకెంత మంది పిల్లలు మాస్టారూ?' అని ఎవరైనా అడిగితే, 'ఒకటో తరగతిలో చేరిన పిల్లకాయలతో కలిపి నూటపాతిక' అనగలిగేంత పితృవాత్సల్యం మీది!

• • •

రోజూ ప్రార్థన సమావేశంలో... ఏదో ఓ మంచి పుస్తకాన్ని పరిచయం చేసేవారు మీరు. అలా ఎన్ని గొప్పగొప్ప గ్రంథాల పేర్లు తెలిశాయో! మీ చొరవతోనే మన బళ్లో గ్రంథాలయం ఏర్పాటైంది. అటకెక్కిన పుస్తకాలన్నీ కిందికి దిగాయి. ప్రతి విద్యార్థీ వారానికి ఒక పుస్తకమైనా చదవాలని నియమం పెట్టారు. మొదట్లో అదో శిక్షలా అనిపించేది. చదవగా చదవగా...చెరకుగడ నమిలినంత మాధుర్యం! పరీక్షల్లో ప్రతిభ చూపిన విద్యార్థులకు విలువైన పుస్తకాల్ని బహుమతిగా ఇచ్చేవారు. మీరిచ్చిన మహాత్ముడి 'సత్యశోధన' ఇప్పటికీ నా దగ్గర ఉంది. ఆ సందర్భమూ గుర్తుంది. చలిజ్వరమని సెలవుచీటీ పంపించి... పట్నానికెళ్లి సినిమా చూసొచ్చినందుకిచ్చారు. అంటే, అబద్ధానికి బహుమతి! సాయంత్రం బడైపోయాక, నేస్తాలతో బంతాట ఆడుతుంటే... బంట్రోతు వచ్చి 'నిన్నే...మాస్టారు పిలుస్తున్నారు' అని చెప్పాడు. అంతే, నా గుండెల్లో రాయిపడింది. చెమటలు తుడుచుకుంటూ మీ గదికి వచ్చాను.

'ఒంట్లో బాలేదన్నావ్. ఎలా ఉందోయ్?' - అడిగారు మీరు.

'జొ...జొ...జ్వరం మాస్టారూ! త....త...తగ్గిపోయింది' - తడబడుతూ చెప్పాన్నేను.

మీరేం మాట్లాడలేదు.

నా చేతిలో 'సత్యశోధన' పెట్టి, 'ఈ పుస్తకం చదువు. చదివాకే నా దగ్గరికి రా...' - ఇక వెళ్లిపోవచ్చన్నట్టు పన్లో నిమగ్నమయ్యారు.

'చడామడా తిట్టేస్తారనుకుంటే, పుస్తకం ఇచ్చారేమిటి?' - అనుకున్నా.

ఏ క్షణమైనా మీ నుంచి పిలుపు రావచ్చన్న భయంతో ఇంటికెళ్లగానే చదవడం మొదలుపెట్టాను. గాంధీజీ తన తండ్రికి అబద్ధం చెప్పిన ఘట్టం చదువుతున్నప్పుడు కన్నీళ్లు పొంగుకొచ్చాయి. బోరుమని ఏడ్చేశాను. మరుసటిరోజు నేరుగా మీ దగ్గరికే వచ్చాను. పుస్తకాన్ని మీ చేతుల్లో పెట్టి, కాళ్ల మీద పడిపోయాను. 'మాస్టారూ... అబద్ధం చెప్పాను. క్షమించండి' అంటూ. 'పశ్చాత్తాపాన్ని మించిన శిక్షేం ఉంటుంది. తెలుసుకోలేకపోతే తప్పు. తెలుసుకుంటే పాఠం. ఎప్పుడూ తప్పు చేయొద్దు. చేసినప్పుడు ఆ తప్పును ఒప్పుకోడానికి వెనకాడనూవద్దు.



బుద్ధిగా చదువుకో. వృద్ధిలోకి వస్తావు' అని ఆశీర్వదించారు. కళ్లు తుడుచుకుంటూ బయటి కొస్తుంటే, 'ఈ పుస్తకం నీదే. నీ కోసమే కొన్నాను' అంటూ నాకిచ్చారు. నా మీద నాకు నమ్మకం తగ్గిన ప్రతిసారీ, గాంధీజీ ఆత్మ కథను మళ్లీ మళ్లీ చదువుతాను. ఈమధ్యే, తెన్నేటి కోదండరామయ్య గారనే పెద్దమనిషి దాదాపు డెబ్బయ్యేళ్ల క్రితం రాసిన 'మా బడి' అనే పుస్తకాన్ని చదివాను. అందులో, కృష్ణారావుగారనే హెడ్మాస్టరు పాత్రలో మీరే కనిపించారు. ఈ లేఖకు ఆ పుస్తకమే స్ఫూర్తి.

పుస్తక సంస్కారాన్నీ, ఉత్తమ సంస్కారాన్నీ ఇచ్చినందుకు... మరొక్కమారు నమస్కారం మాస్టారూ!

• • •

మీ శిక్షణలో చదువు ఆటలా, పాటలా హాయిగా సాగిపోయేది. పాఠం అర్థం కాకో, పరీక్షలు బాగా రాయలేకో ఒత్తిడికి గురైన సందర్భం ఒక్కటంటే ఒక్కటీ లేదు. మార్కుల పట్లా ర్యాంకుల వ్యవస్థ పట్లా మీకు నమ్మకం ఉండేది కాదు. చిన్నాచితకా పరీక్షల్లో అయితే, అసలు మార్కులే ఇచ్చేవారు కాదు. బాగా రాస్తే 'బాగు', ఓమోస్తరుగా రాస్తే, 'ఫర్వాలేదు, ఇంకా కష్టపడాలి', మరీ చెత్తగా ఉంటే, 'నన్ను కలవండి'.... అని మాత్రమే రాసేవారు. ఆ పిలిచేది కూడా ఎక్కడ పొరపాటు జరిగిందో చెప్పడానికే. 'ఫలానా విద్యార్థికి లెక్కల్లో ఫలానా సూత్రం అర్థమైనట్టు లేదు. బాగా సాధన చేయించండి' అని సంబంధిత ఉపాధ్యాయుడిని ఆదేశించేవారు. కాబట్టే, మీ హయాంలో మన పాఠశాల ఫలితాల్లో ప్రథమ స్థానంలో ఉండేది. ఎవరిని ఏ గ్రూపులో చేర్పించాలన్నదీ సూచించేవారు. లెక్కల్లో నూటికి నూరు సాధించినా సరే, చరిత్ర పట్ల ప్రత్యేక ఆసక్తి ఉన్న పిల్లాడిని ఆర్ట్స్‌లోనే చేర్పించమని తల్లిదండ్రులకు చెప్పేవారు మీరు. ఎంపీసీలూ బైపీసీల వెర్రి వ్యామోహం అస్సలు వద్దనేవారు. 'అందరూ ఇంజినీర్లూ డాక్టర్లూ అయిపోతే, దేశమేమైపోవాలి? సమాజానికి కవులూ కళాకారులూ కూడా అవసరమే' అనేవారు. కన్నవారికి మీరెంత చెబితే అంతే!

ఇన్నేళ్ల తర్వాత కూడా మాలో కొన్ని వ్యామోహాలు తగ్గలేదు మాస్టారూ! సీట్ల కోసం పిల్లల్ని ర్యాంకుల ఫ్యాక్టరీలకు తోలేస్తున్నాం. ఐఐటీల్లో చదవకపోతే భవిష్యత్తే లేదన్న భ్రమ కల్పిస్తున్నాం. కన్నవారి అంచనాల్ని అందుకోలేక పిల్లలు నరకయాతన అనుభవిస్తున్నారు. '... మలయే భిల్ల పురంధ్రీ చందన తరుకాష్ఠ మింధనం కురుతే' అంటూ మీరు తరచూ జగన్నాథ పండిత రాయల శ్లోకాన్ని ప్రస్తావించేవారు. మలయపర్వత ప్రాంతంలోని భిల్లజాతి మహిళలకు ముళ్లకంపకూ గంధపు చెట్లకూ తేడా తెలియదు. శ్రీగంధపు చెక్కల్ని వంట చెరుకుగా వాడేస్తారట... అని చెప్పేవారు. ఆ అమాయకుల సంగతేమో కానీ, పిల్లల చదువుల విషయంలో మేం ఇప్పటికీ భిల్లుల వారసులమే. వాళ్ల ఆసక్తుల్నీ అభిరుచుల్నీ అర్థం చేసుకునేంత తీరికా ఓపికా మాకు ఉండటం లేదు. ఆటవికులు ప్రతి మొక్కలో వంట చెరుకును చూసినట్టు, నవనాగరికులైన మేం ప్రతి పిల్లాడిలోనూ డాక్టరునో ఇంజనీరునో మాత్రమే చూస్తాం. మా తప్పుకు శిక్ష విధించండి మాస్టారూ... మా చెవి మెలేయండి, మమ్మల్ని కోదండం ఎక్కించండి!

• • •

పల్లెపల్లెంతా మీ ముందు చేతులు కట్టుకుని నిలబడేది. మీరు వీధిలో నడుస్తుంటే, అడుగడుగునా దండాలే! నోట్లోని చుట్టలు వెనక్కి వెళ్లిపోయేవి. తాగుబోతు వెధవలు మరోదారి చూసుకునేవారు. చుట్టుపక్కల ప్రాంతాల్లో మీకున్న పలుకుబడి గురించి హైద్రాబాద్‌లోని రాజకీయ పార్టీల దాకా వెళ్లిందనీ, మిమ్మల్ని ఎమ్మెల్సీగా నిలబెడతామంటూ కొందరు ఖద్దరు పెద్దలు పడవల్లాంటి కార్లలో పట్నం నుంచీ వచ్చారనీ చెప్పుకోగా విన్నాను. ఆ ప్రతిపాదనను మీరు నిర్మొహమాటంగా తిరస్కరించారట కదూ! ఎందుకు మాస్టారూ వృత్తి పట్ల అంత నిబద్ధత. బమ్మెర పోతన్నలా మీరు కూడా... 'నిను ఆకటికిన్ కొనిపోయి, యల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మ, త్రిశుద్ధిగనమ్ము భారతీ' అని చదువులతల్లికి మాటేమైనా ఇచ్చారా? ఇచ్చే ఉంటారు. అయినా, పదవీవిరమణ తర్వాత కూడా పట్టుదలేమిటి చెప్పండి? ఆ కార్పొరేటు కాలేజీ వాళ్లెవరో ప్రిన్సిపాలుగిరీ ఇస్తామంటూ వెండి పళ్లెంలో నోట్లకట్టలు పెట్టి తాంబూలం కింద సమర్పించబోతే... పురుగును చూసినట్టు చూశారట. కంటిచూపుతోనే కుదర్దని చెప్పేశారట. మంచి పని చేశారు. అక్షర వ్యాపారులతో మాట్లాడేదేం ఉంటుంది. మీరు నిప్పు!

'సూర్యస్యాపి భవేత్సూర్యో
హ్యగ్నేరగ్నిః ప్రభోః ప్రభుః
శ్రియశ్చ శ్రీర్భవేదగ్ర్యా కీర్త్యాః కీర్తిః
క్షమా క్షమా... అంటాడు వాల్మీకి మహర్షి, శ్రీరామచంద్రుడి గురించి. రాముడు... సూర్యుడికి సూర్యుడిలా, అగ్నికి అగ్నిలా, ప్రభువుకు ప్రభువులా కనిపిస్తాడట. మీరూ అంతే... గురువులకే గురువు. చదువులకే చదువు. విలువలకే విలువ. నాకు తెలుసు. మీకు పొగడ్తలు గిట్టవు. ఇది పొగడ్త కాదు... వ్యక్తిత్వ చిత్రణ.

'వాక్యమును హనుమంతుడి వాలము వలే పెంచకు...' అని మీరు చేసిన హెచ్చరిక మళ్లీ మళ్లీ గుర్తొస్తోంది. ఇప్పటికే ఉత్తరం సుదీర్ఘమైంది. ఇక ఆపేస్తాను. వీలైనంత త్వరగా మీ ముందు వాలిపోతాను. మీ పాదాల దగ్గర కూర్చుని... విలువల వాచకాన్ని పునశ్చరణ చేసుకుంటాను.

నమస్తే. నమస్తే. నమస్తే.

ఇట్లు.....
మీ శిష్య పరమాణువు.

**- సండే డెస్క్**

## పిల్లల సారు...

అటెండెన్స్ ప్లీజ్. నంబర్ వన్. ప్రజెంట్ సార్. నంబర్ టూ. ప్రజెంట్ సార్. నంబర్ త్రీ. ఆబ్సెంట్ సార్.

ఒకరోజు, రెండ్రోజులు, మూడ్రోజులు. విద్యార్థి గైరుహాజరీ విషయంలో ఏమాత్రం అనుమానం వచ్చినా నల్గొండ జిల్లాలోని శివన్నగూడ ప్రాథమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడిగా పని చేస్తున్న... కుక్కమూడి జనార్దన్‌సార్ నేరుగా విద్యార్థి ఇంటికే వెళ్లిపోతారు. పిల్లాడు బడికి రాకపోవడానికి కారణం తెలుసుకుంటారు. ఆరోగ్య సంబంధమైన సమస్య అయితే తనే వైద్యుడి దగ్గరికి తీసుకెళ్తారు. ఆర్థిక కారణాలు అయితే తనవంతుగా ఏం చేయగలరో ఆలోచిస్తారు. అమ్మానాన్నల నిర్లిప్తతో నిర్లక్ష్యమో కారణమైతే... మనసు మార్చే ప్రయత్నం చేస్తారు. ఒకటేమిటి, విద్యార్థి మళ్లీ బడిబాట పట్టడానికి ఏం చేయాలో అన్నీ చేస్తారు. కాబట్టే, ఆయన పనిచేస్తున్న ఏ పాఠశాలలోనూ మధ్యలో బడి మానేసే పిల్లలు చాలా తక్కువగా ఉంటారు. బాలకార్మిక వ్యవస్థ మీదా ఆయన పోరాటం చేస్తున్నారు. బడి వయసు పిల్లలు... బడి ఆవరణలో కాకుండా ఇంకెక్కడ కనబడినా ఆయనలోని ఉపాధ్యాయుడు ఊరుకోడు. బళ్లో చేర్పించేదాకా మనసు మనసులో ఉండదు. అలా, కార్ఖానాల కళ్లెం తెంచుకుని బడిబాట పట్టిన బాల కార్మికులు చాలామందే ఉన్నారు. కాబట్టే, కేంద్ర మానవ వనరుల శాఖ ఉత్తమ ఉపాధ్యాయుడి పురస్కారానికి ఆయనను ఎంపిక చేసింది.



# 'ఫైవ్‌స్టార్' బస్సులు!

**నాలుగు చక్రాల బస్సే... కొన్నిసార్లు, సకల హంగులూ సిద్ధంగా ఉన్న బోర్డ్‌రూమ్ అవతారం ఎత్తుతుంది. మరికొన్నిసార్లు, కమ్మని రుచుల చిరునామా అయిన రెస్టారెంట్‌గా మారిపోతుంది. కార్పొరేట్ వ్యాపారాల నుంచి టూరిజం దాకా... ప్రతి రంగంలోనూ ఫైవ్‌స్టార్ బస్సులే సూపర్‌స్టార్స్ ఇప్పుడు!**




హైదరాబాద్ నుంచి విశాఖపట్నం... గంటలకొద్దీ ప్రయాణం. వెళ్లగానే మీటింగులూ కాన్ఫరెన్సులూ మేధోమథనాలూ... చాలా బిజీ షెడ్యూలు! అంతవరకూ ఫర్వాలేదు. ఆ ప్రయాణం మాటేమిటి? ఆ సమయాన్ని వృథా చేయకుండా... బస్సులోనే ఓ మీటింగ్ ఏర్పాటుచేస్తే ఎలా ఉంటుంది? ఆ ఆలోచనతోనే సాధారణ బస్సులను కూడా కాన్వాయ్‌లుగా మార్చేస్తున్నారిప్పుడు. విదేశాల్లో మాత్రమే కనిపించే ఫైవ్‌స్టార్ బస్సులు... మన రోడ్ల మీదా రయ్‌రయ్ అంటున్నాయి. మీటింగులు పెట్టుకోడానికి వీలుగా... ఒక ఏసీ కాన్ఫరెన్స్ హాలు, అందులో సోఫాలు, చిన్నచిన్న టేబుళ్లు, గోడ మీద ఒకటో రెండో ఖరీదైన పెయింటింగ్స్. సమావేశం మధ్యలో రుచి చూడ్డానికి... ఒకట్రెండు చిరుతిళ్లు, అవసరమైతే వంట చేసుకోడానికి చక్కని కిచెన్. ఓ మూలన డబుల్‌డోర్ ఫ్రిజ్. గోడకి ప్లాస్మా టీవీ. అదనంగా వైఫై... ఒక్క మాటలో చెప్పాలంటే ఫైవ్ స్టార్ హోటల్ వైభోగాలన్నీ అక్కడా ఉంటాయి. నిన్నమొన్నటి వరకూ, ఇలాంటి వసతులు సినిమా తారల 'వ్యానిటీ వ్యాన్'లోనే ఉండేవి. ఇప్పుడు, సామాన్యుల చెంతకూ వస్తున్నాయి.

**ట్రాఫిక్ సమస్యే...**

మహానగరాల్లో ట్రాఫిక్ సమస్య తీవ్రంగా ఉంటోంది. అసలే ఆలస్యం, ఊహించని రద్దీ ఎదురైతే మరింత ఆలస్యం! అనుకున్న సమయానికి గమ్యాన్ని చేరుకోవడం దాదాపుగా అసాధ్యం. దీంతో వ్యాపారవేత్తలూ, సీయీవో స్థాయి ఉన్నతోద్యోగులూ ఈతరహా వాహనాల్ని ఇష్టపడుతున్నారు. బాసు బండి ఎక్కడమే ఆలస్యం... ఆఫీసు పని మొదలైపోతుంది. వినోదరంగంలోనూ 'ఫైవ్‌స్టార్' గాడీల ప్రాధాన్యం పెరుగుతోంది. రాజస్థాన్ ప్రభుత్వం 'జైపూర్ సఫారీ' పేరుతో డబుల్ డెక్కర్ బస్సులను నడుపుతోంది. ఇవి వ్యానిటీ బస్సులకు ఏమాత్రం తీసిపోవు. పింక్ సిటీ సఫారీ బస్సు మొదటి అంతస్తులో... అధునాతన డ్రాయింగ్ రూమ్, రెండో అంతస్తులో రెస్టారెంటూ ఉంటాయి. ఈ బస్సులో ప్రయాణించాలంటే.... ఉదయం పూట అయితే, తలా ఐదొందలూ చెల్లించాలి (ఎనిమిదిన్నర నుంచి ఐదున్నరదాకా). సాయంత్రాలు అయితే తలా తొమ్మిదివందలు కట్టాల్సి ఉంటుంది (ఆరున్నర నుంచి పదిన్నర దాకా). 'ఆన్‌వీల్' పుట్టినరోజు పార్టీలకూ బ్యాచిలర్ పార్టీలకూ కూడా ఈ సఫారీలను అద్దెకు ఇస్తున్నారు. రివ్వున దూసుకెళ్తున్న వాహనంలో విందులూ వినోదాలంటే... స్వర్గానికి బెత్తెడు దూరంలో ప్రయాణిస్తున్నట్టే.

**బిజినెస్‌లోనూ...**

క్షణం తీరికలేని నగర జీవితంలో.... దుస్తుల కోసం షాపులకు వెళ్లి, గంటలు గంటలు వెచ్చించి, నచ్చిన డ్రస్సులను ఎంపిక చేసుకునేంత తీరిక ఎవరికీ ఉండటం లేదు. అందుకే, ఆన్‌లైన్ షాపింగ్‌కే మొగ్గు చూపుతున్నారు. దీంతో ఆఫ్‌లైన్ మీద ఆధారపడిన... టైలర్లూ, టెక్స్‌టైల్ షోరూముల యజమానులూ చాలా నష్టపోతున్నారు. దాదాపుగా దుకాణం కట్టేసుకోవాల్సిన పరిస్థితి. ఓసారి రెండున్నర గంటల పాటు ట్రాఫిక్‌లో ఇరుక్కుపోయిన హర్ష్ అనే వస్త్రవ్యాపారికి అప్పుడే తత్వం బోధపడింది. ట్రాఫిక్ మహమ్మారి వల్లే... ఆఫీసులకో, ఆసుపత్రులకో తప్పించి... గడప దాటడానికి జనం ఇష్టపడటం లేదని అర్థమైపోయింది. వెంటనే 'కార్పొరేట్ కాలర్స్ ఆన్ వీల్' అనే సంస్థను ఏర్పాటు చేశాడు. 'ఆన్‌వీల్ బిజినెస్' కాన్సెప్ట్‌తో సాగే ఈ సంస్థ ముంబయిలో ప్రతీ వీధికి బస్సులో వెళ్లి, కస్టమర్ల నుంచి కొలతలు తీసుకుంటుంది. కుట్టుపని అయిపోయిన తర్వాత, మళ్లీ అక్కడికే వెళ్లి డోర్ డెలివరీ ఇస్తుంది. టైలరింగ్ గది, ఫిట్టింగ్ గది, బిల్లింగ్ డెస్క్‌తో కూడిన ఒక పెద్ద వ్యాన్... కస్టమర్ల సేవకు సిద్ధంగా ఉంటుంది. ఫ్యాషన్ సలహాలు ఇచ్చేందుకు డిజైనర్లు కూడా ఉంటారు. ఇలా... కార్పొరేట్ వ్యవహారాల నుంచి స్పాల దాకా మరిన్ని వ్యాపారాలు చక్రాలకెక్కే అవకాశాలు పుష్కలంగా కనిపిస్తున్నాయ్. ❋







# నా మా(క్లా)స్ సీక్రెట్స్ ఇవే!

**బోయపాటి శ్రీను సినిమాల్లో ప్రేక్షకులకు అవసరమైన అన్ని అంశాలూ తూకం వేసినట్టు కనిపించినప్పటికీ, యాక్షన్ సన్నివేశాలకు మార్కులు బాగా పడతాయి. ఆయన హీరోలు కండలు తిరిగి పక్కా మాస్‌గా ఉంటారు. "ఎప్పుడు చూసినా చెదరని క్రాపు, నలగని దుస్తులు, మాసిపోని గడ్డంతో 'క్లాస్'గా కనిపించే ఈయనేనా అంత 'మాస్'గా సినిమాలు తీసేది" అని ఆశ్చర్యపోతారెవరైనా. తాజాగా 'జయ జానకి నాయక'తో ప్రేక్షకుల ముందుకు వచ్చిన బోయపాటి శ్రీనులోని మాస్, క్లాస్ ఎలిమెంట్స్ గురించి ఆయన మాటల్లోనే...**




**నే**ను తీసిన సినిమాలన్నీ మాస్ ఎంటర్‌టైనర్స్‌గా ముద్రపడినప్పటికీ, అవి యూత్‌తో పాటు ఫ్యామిలీ ఆడియెన్స్‌నూ ఆకట్టుకున్నాయి కాబట్టే ఘన విజయాన్ని సాధించాయి. నిజానికి లవ్‌స్టోరీస్‌ను నేను చాలా బాగా డీల్ చేస్తాను. తొలి సినిమా 'భద్ర' తర్వాత నా సినిమాలు భిన్నంగా కనిపించాలంటే ఇంకేదో కావాలని ఆలోచించాను. అప్పుడే నా దృష్టి మాస్‌వైపు మళ్లింది. నిజానికి చిన్నప్పటినుంచే మాస్ ఎలిమెంట్స్ నన్ను బాగా ఆకట్టుకునేవి. పుట్టిపెరిగిన ఊరు, చుట్టుపక్కల ఉండే వాతావరణం కూడా రఫ్‌గానే ఉండేవి. నేనొక మధ్య తరగతి కుటుంబానికి చెందిన సాధారణ యువకుడిని. ఊళ్లో (పెద్దకాకాని, గుంటూరు జిల్లా) స్నేహితులతో కలిసి కబడ్డీ, కర్రబిళ్ల ఆడుకునేవాణ్ణి. ఇంటి ఆవరణలోని బావిలో నీళ్లు తోడటమే నా రోజువారీ వ్యాయామం. ఒకరకంగా అదే నా జిమ్. మేము ఇంటర్‌లో ఉండగానే దేవభక్తుని సత్యనారాయణ అని నా మిత్రుడు ఒకమ్మాయిని ప్రేమించి, విఫలమవ్వడంతో ఆత్మహత్య చేసుకున్నాడు. ఆ సంఘటన నా మీద బలమైన ముద్ర వేసింది.

తొలి చిత్రం 'భద్ర'లో అయినా, తాజా చిత్రం 'జయ జానకి నాయక'లో అయినా నా హీరోని ప్రేమించిన అమ్మాయి కోసం ఎంతకైనా తెగించే సాహసిగా, నమ్మినవారికి రక్షకుడిగా చూపించడానికి అదే కారణం. బలమైన ప్రత్యర్థిని ఎదుర్కోవాలంటే కండలు తిరిగి ఉండాలి. చూడగానే ప్రేక్షకులకు ఒక నమ్మకం, భరోసా అనేది ఏర్పడాలి. బాలకృష్ణ (సింహా, లెజెండ్), వెంకటేష్ (తులసి), ఎన్టీఆర్ (దమ్ము) వంటి 'స్టార్స్'కు కండలు లేకపోయినా... వారి ఆహార్యం, లుక్స్ చూస్తే చాలు, ప్రత్యర్థి ఎంతటి బలశాలైనా ఎదుర్కొంటారనే ఫీలింగ్ ప్రేక్షకులకు ఆల్రెడీ కలుగుతుంది కాబట్టి పర్వాలేదు. కానీ కుర్ర హీరోల విషయంలో అలా కాదు. వారికి ఒక బిల్డప్ ఉండాలి. అల్లు అర్జున్ (సరైనోడు) మిగతా సినిమాల్లో కన్నా నా సినిమాలో భిన్నంగా కనిపించడానికి కారణం అతడిలోని మాస్ అప్పీల్‌ను సరిగ్గా ప్రొజెక్ట్ చేయడమే. 'సరైనోడు'లో అల్లుఅర్జున్ కండలు తిరిగిన బాడీతో జిమ్‌లో ఉండే 'కెటిల్‌బెల్స్'ను పట్టుకుని నిల్చున్న పోస్టర్ (ఫస్ట్‌లుక్) చూసి అంతా షాకయ్యారు. అప్పటిదాకా హీరోలు పొడవైన కత్తులు, గొడ్డళ్లు, తుపాకులు పట్టుకుని కనిపించేవారు వాటికన్నా సాలిడ్‌గా ఉండే 'కెటిల్‌బెల్స్'తో హీరో ప్రత్యర్థులను ఎదుర్కోవడంలో 'ఫోర్స్', 'ఇంప్రెషన్' ఎక్కువగా కనిపిస్తాయనే నా నమ్మకం అందులో బాగా వర్కవుట్ అయ్యింది. అలాంటి ఆలోచనల కోసం ఎప్పటికప్పుడు నన్ను నేను అప్‌డేట్ చేసుకునేందుకు ప్రయత్నిస్తుంటా. రోజుకు రెండు సినిమాలు తప్పకుండా చూస్తాను. అయితే వాటిని కాపీ కొట్టడానికి మాత్రం కాదు. టేకింగ్‌లో నేనెక్కడ ఉన్నానో తెలుసుకునేందుకు మాత్రమే. ఫైట్ ఫైట్‌లాగా కాకుండా అందులో స్టయిల్ ఉండాలనుకుంటా. 'సింహా'లో బాలయ్య కొత్తగా కనిపించడానికి ఈ 'స్టయిలే' కారణం.

**హీరోల బాడీలాంగ్వేజ్‌కు తగ్గట్టుగా...**

నా సినిమాల్లో యాక్షన్ సీన్లు చక్కగా పండటానికి ప్రధాన కారణం నేను హీరోల బాడీ లాంగ్వేజ్‌ను బాగా గమనిస్తుంటా. ఒక హీరోతో సినిమా తీయాలంటే ముందుగా వారిలోని ప్లస్సులూ, మైనస్‌లూ గుర్తిస్తా. యాక్షన్ సీన్ పండాలంటే ఆర్టిస్టు, స్థలం, అక్కడి వాతావరణం, సీన్ ఎలివేషన్... ఇవి నాలుగూ చాలా ముఖ్యం. యాక్షన్ ఎపిసోడ్‌కు ముందు వచ్చే సీన్‌ను బాగా వర్కవుట్ చేయాల్సి ఉంటుంది. ప్రేక్షకులు 'విలన్‌ను ఇక్కడ చితకబాదాలి' అని బలంగా కోరుకున్నప్పుడే నా హీరోలు యాక్షన్‌లోకి దిగి ఇరగదీస్తారు. దాంతో ప్రేక్షకులు ఎగ్జయిటింగ్‌గా ఫీలై హీరోకు కనెక్ట్ అవుతారు. మాస్ సీన్లు అందరూ తీస్తారు కానీ నేను చూపించేది స్టయిలిష్ మాస్. 'దమ్ము'లో ఎన్టీఆర్... 'సింహా', 'లెజెండ్'లో బాలయ్య... 'సరైనోడు'లో బన్నీ చేసిన ఫైట్స్ చూస్తే ఎవరికైనా మాస్‌కూ, స్టయిలిష్ మాస్‌కూ తేడా

తెలుస్తుంది.

తీయబోయే సినిమా మొత్తం ముందుగా స్క్రిప్టు పేపర్ల మీదే నాకు స్పష్టంగా కనిపిస్తుంది. ఆ స్పష్టత రానంతవరకూ షూటింగ్‌కు వెళ్లను. ఒక యాక్షన్ సీన్‌కు ఎన్ని షాట్స్ తీయాలనే లెక్క కూడా నాకుంటుంది. దాని ప్రకారమే చకా చకా తీస్తుంటా. ఒక సీన్‌లోని వివిధ రకాల షాట్స్‌ను ఒకేసారి తీసి ఎడిటింగ్‌లో మ్యాచ్ చేయడం నాకు బాగా తెలిసిన విద్య. ఈ విద్యను మా గురువు ముత్యాల సుబ్బయ్యగారి దగ్గరి నుంచి నేర్చుకున్నాను. అలా చేయాలంటే ఆర్టిస్టు మీద గ్రిప్ ఉండాలి. ఒక షాట్‌లో హీరోను క్లోజ్‌గా కానివ్వండి, లాంగ్‌షాట్‌లో కానివ్వండి చూపిస్తున్నప్పుడు గాలికి ఎగిరే అతడి తల వెంట్రుకలతో సహా వెనుక ఉండే ఆర్టిస్టుల కదలికలు కూడా మైండ్‌లో ఫిక్స్ అవుతాయి. అంతటి ఏకాగ్రత ఉంటేగానీ ఎడిటింగ్‌లో షాట్ మ్యాచ్ అవ్వదు.

ఉదయం లొకేషన్‌కు వెళ్లగానే సీన్ పేపర్స్‌లో ఉన్నది ఉన్నట్టుగా అందరికీ వినిపించి, తీయబోయే షాట్ ఎలా ఉంటుందో, ఎవరేం చేయాలో, డైలాగ్స్ ఎలా చెప్పాలో క్లియర్‌గా వివరిస్తా. ఆ సమయంలో అందరూ నిల్చునే వినాలనేది నా ప్రధాన డిమాండ్. అలాగైతేనే అటెన్షన్ ఉంటుందనుకుంటా. ప్రధాన పాత్రధారుల వెనుక ఉండే ఆర్టిస్టులు కూడా ఏం చేయాలో యాక్షన్‌తో సహా చేసి చూపిస్తా. అందరూ ఎమోషనల్‌గా ఇన్వాల్వ్ అయినప్పుడు మాత్రమే సీన్స్ బాగా వస్తాయి. ఫైట్ మాస్టర్స్‌కు (రామ్‌లక్ష్మణ్ సోదరులతో నాకు చక్కని అవగాహన ఉంది) కూడా నాక్కావాల్సిన ఎఫెక్ట్‌ను వివరిస్తా. నాకు తెలియకుండా ఫైట్‌మాస్టర్స్ ఒక్క క్లోజ్‌షాట్ కూడా తీయరు. పాత్రోచితంగానే హీరోల బాడీలాంగ్వేజ్ ఉంటుంది. ఉదాహరణకు 'జయ జానకి నాయక'లో హీరో స్పోర్ట్స్‌మ్యాన్ కాబట్టి అతడి బాడీ ఫిట్‌గా ఉంటుంది. ఫైట్ సీన్స్‌లో కూడా ఒక స్పోర్ట్స్‌మ్యాన్ సైకాలజీ కనిపిస్తుంది. ఇదంతా పాత్రల్ని డిజైన్ చేసేప్పుడే రాసుకోవడంతో పాటు, దాని నేపథ్య సంగీతాన్ని కూడా ఊహించుకుంటా కాబట్టి నా సినిమాల్లో మాస్ సీన్లు ఏ సెంటర్ నుంచి సి సెంటర్‌దాకా అందర్నీ ఆకట్టుకుంటాయి. టికెట్ కొనుక్కుని థియేటర్‌లోకి అడుగు పెట్టిన ప్రేక్షకుడికి ప్రతీ సీన్ అద్భుతంగా కనిపించాలనుకుంటా. అందుకే నేను తీసే సినిమాలన్నీ గ్రాండియర్ లుక్‌తో కనిపిస్తాయి. ఈ విషయంలో అస్సలు కాంప్రమైజ్ కాకపోవడమే నా ప్రధాన బలం.









### చిన్నప్పటి నుంచి నా 'స్టయిలే' అది...

'పక్కా మాస్ సినిమాలు తీసే బోయపాటి శ్రీను షూటింగ్‌లోగానీ, బయటగానీ క్లాస్‌గా కనిపిస్తాడ'ని చాలామంది అంటుంటారు. ఎప్పుడూ నలగని దుస్తులతో 'ఫ్రెష్'గా కనిపించడానికి ఓ కారణం ఉంది. ఏడవ తరగతి నుంచే పనిచేస్తూ చదువుకోవడం నాకు అలవాటైంది. కుటుంబం పెద్దది కావడంతో బాధ్యతలు కూడా ఎక్కువే. అయితే కారం మెతుకులు తిన్నా సరే బయట మాత్రం బాగుండాలని, ఉన్నంతలో నీట్‌గా తయారయ్యేవాణ్ణి. శుభ్రతకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాను. సెట్లోకి నేను అలా తయారై వెళ్లడం వల్ల నాతో పనిచేస్తున్నవారు కూడా ఫ్రెష్‌గా ఫీలవుతారు. షూటింగ్ ఉన్నా లేకున్నా ఉదయం ఐదున్నరకు నిద్రలేచి, సూర్య నమస్కారాలు, యోగా చేయడం అలవాటు. ఆ తర్వాత స్నానం చేసి లక్ష్మీనరసింహస్వామికి పూజ చేస్తా. దుస్తుల విషయంలో చాలా శ్రద్ధ చూపుతా. ఏవి పడితే అవి వేసుకోవడం ఇష్టం ఉండదు. నాకు కోపం ఎక్కువ కాబట్టి, కూల్‌కలర్స్‌కు ప్రాధాన్యం ఇస్తా. నా బావమరిది రవికి నా ఇష్టాయిష్టాలు బాగా తెలుసు. అతడు తెచ్చిన దుస్తుల్లో నాకు నచ్చినవి సెలెక్ట్ చేసుకుంటా. కాస్ట్యూమ్స్ డిపార్ట్‌మెంట్‌వారితో నాకు తగ్గట్టుగా ఆల్ట్రేషన్ చేయించుకుంటా. అంతేగానీ ప్రత్యేకంగా షాపింగ్ చేయను. డ్రెస్ సెన్స్, బాడీ లాంగ్వేజ్ ప్రభావం తప్పకుండా ఎదుటివారిపై ఉంటుందని నమ్ముతాను. ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, రకరకాల పరిస్థితుల్లో షూటింగ్ చేయాల్సి ఉంటుంది కాబట్టి నిరంతరం నీట్‌గా ఉండటం కష్టమే అనే మాట నాకు మాత్రం వర్తించదు. షూటింగ్‌లో ఉన్నా, ఇంట్లో ఉన్నా, ఏదైనా ఫంక్షన్‌కు హాజరైనా నేనిలాగే కనిపిస్తా. 'నువ్వే హీరోలా ఉంటావు' అని చాలామంది అంటుంటారు కానీ నవ్వి ఊరుకుంటా. నేనెప్పటికీ దర్శకుడినే. ఆ విషయంలో నాకు స్పష్టత ఉంది.

● చల్లా శ్రీనివాస్



- శివ, మణిరత్నం ఘర్షణ, పెద్దరికం, బలరామకృష్ణులు నాకిష్టమైన మాస్ సినిమాలు.
- చిన్నప్పటి నుంచీ ఎన్టీఆర్ సినిమాలకు వీరాభిమానిని.
- సినిమా విడుదలైన రోజే చూసే అలవాటు లేదు. ఆ రోజు ఉదయమే పూజ చేసుకుని ఇంట్లోనే స్క్రిప్టు ఫైల్స్ ముందేసుకుని కూర్చుంటా. అన్ని ప్రాంతాల నుంచి వచ్చే రిపోర్ట్స్ తెలుసుకుంటా.
- ప్రతీ రోజూ తప్పకుండా రెండు సినిమాలు (ఏ భాషవైనా) చూస్తుంటా.
- ట్రావెలింగ్ ఇష్టముండదు. అప్పుడప్పుడు క్లోజ్‌ఫ్రెండ్స్‌తో మాత్రం బయటికి వెళ్తుంటా.
- సినిమాలు తప్ప మరో ధ్యాస లేదు. రీమేక్స్ చేయడమంటే బోర్‌గా ఫీలవుతా. నా దగ్గరే చాలా కథలున్నాయి.
- ఫిట్‌నెస్‌కు ప్రాధాన్యం ఇస్తా. ఏది పడితే అది తినను.



# పంచప్రాణాలు

**"యువరానర్... ఎంత కిరాతకంగా నేరానికి పాల్పడ్డాడో, అంతే కఠినశిక్ష విధించాలని విజ్ఞప్తి చేస్తున్నాను..."**
**"యువరానర్.. నేరం చేసినప్పుడు వయసుని కూడా దృష్టిలో పెట్టుకుని తక్కువ శిక్ష విధించాలని కోరుతున్నాను. ఇప్పటికే ఆరేళ్లుగా తీవ్ర మానసిక క్షోభకి లోనయ్యాడు..." పబ్లిక్ ప్రాసిక్యూటర్ దేశాయ్, డిఫెన్స్ న్యాయవాది అనక్ లెటోలు చెబుతున్నది వింటూ, "వయసుని దృష్టిలో పెట్టుకునే ఇంత నేరం చేశాడంటారా, మిస్టర్ అనెక్ లెటో?" అని ప్రశ్నించాడు జడ్జి. ముగ్గురి మొహాలూ చూస్తూ బోనులో నిలబడ్డాడు డయాజ్...**

• • •

స్నేహాల్ డయాజ్... గంపెడు బట్టలు ఉతుకుతూంటే చేతులు నొప్పెడుతున్నాయి. బకెట్లో వేసి పిండుతూంటే ఆ నీళ్లల్లో తల్లి రూపమే కన్పిస్తోంది. తల్లి తల పట్టుకుని నీళ్ళలో ముంచుతూ చంపడానికి ప్రయత్నిస్తున్న తండ్రి... ఒకసారి కాదు, చాలాసార్లు. "ఏరా? ఏంటీ?" అని వీపు పగిలేలా కొట్టింది సవతి తల్లి వచ్చి, "ఉతుకు! ఉతికితేనే నీకు బతుకు!" జుట్టుపట్టుకుని కసిదీరా వంగదీసింది. బాధతో అరిచాడు.

"అవన్నీ ఉతికాకే తిండి పెట్టాలి!" ఇంట్లోంచి తండ్రి అరుపు.

ఉదయం నుంచీ మధ్యాహ్నం దాకా ఇంటెడు బట్టలుతికితేనే ఇంత తిండి పెడతారు. ఏడేళ్ళ వయసుకి ఇది పెద్ద కష్టమైపోయింది. బయటపడే మార్గం కన్పించడం లేదు- తల్లి కన్పించనట్టే. తల్లి ఎలా చనిపోయిందో అర్థం గావడం లేదు. లంచగొండి తండ్రి గోవా షిప్ యార్డులో ఉద్యోగం పోగొట్టుకున్నాడని తెలుసు. అప్పుడామె ఆత్మహత్య చేసుకుందని కొందరు, విషమిచ్చి చంపాడని కొందరూ చెప్పుకున్నారు. ఆమెకి విషమిచ్చి తర్వాత నిప్పంటించాడని కూడా కొందరు చెప్పుకున్నారు. ఏమైనా పోలీసులు పట్టుకోలేదు. వెంటనే ఈ పెళ్లి చేసుకున్నాడు. ఇది వచ్చిన కాడ్నించీ చంపుకుతింటోంది. దీనికి వంత పాడుతున్నాడు యెదవ తండ్రి ...

• • •

"వెరీ సారీ బ్రో, నీకింత వుందని తెలీదు"

"ఇంకా చాలా వుంది, నా ఫాదర్ ఒక గాడిద! ఈ గాడిద వెంట అది వుంది చూశావూ- అదొక గాడిదన్నర గాడిద!"

19 ఏళ్ల స్నేహాల్ డయాజ్, పాతికేళ్ళ నరేష్ డురాడోలు ఫ్లాట్‌లో మందుకొడుతూ మాట్లాడుకుంటున్నారు. పక్కన లాప్‌టాప్‌లో అల్ఫ్రెడ్ రోజ్ కొంకణి పాట వస్తోంది. పదిహేను రోజుల క్రితం పరిచయమైన డయాజ్ బాగా క్లోజ్ అయిపోయాడు. గోవా పోర్టు సిటీ వాస్కో సమీపంలోని చిన్న గ్రామం చికలింలో నరేష్ ఫ్లాట్‌కి తరచూ వచ్చి కాలక్షేపం చేస్తున్నాడు. "నేనైతే పిచ్చిపట్టి తిరుగుతా రోడ్లమీద!" అని నరేష్ ఉద్వేగంగా అనడం చూసి,

"నాకూ అప్పుడప్పుడూ పిచ్చెక్కుతూనే వుంటుంది బ్రో, నాగురించి తల్చుకుంటే" అంటూ బాటిల్ మొత్తం లేపేశాడు డయాజ్. మత్తులో తూలుతూ జేబులోంచి తీశాడు... "ఏ ? ఏ మిటవి?" కళ్ళు విప్పార్చుకుని చూస్తూ అన్నాడు నరేష్.

టీపాయ్ మీద వరసగా పేర్చాడు మొత్తం ఐదు కత్తుల్ని డయాజ్. అర్థంగాక, "ఎందుకవి?" అన్నాడు నరేష్.

"ఇవి నా పంచ ప్రాణాలు- మా అమ్మ!"

"నీకెక్కువయ్యింది, పడుకో!"

"నేను దొంగనని తెల్సా నీకు? దొంగని ఎందుకయ్యాను? ఆc...? ఎందుకయ్యాను!"

"బ్రో, పడుకోమన్నానా? నేనూ పడుకుంటా"

"పడుకోవాలా? నేను పడుకోవాలా?" ఒక కత్తి తీసుకుని మీద పడ్డాడు డయాజ్. ఐదు నిమిషాల తర్వాత చుట్టూ చూస్తూ నిలబడ్డాడు. మొబైల్, లాప్‌టాప్, కారు కీస్, ఫారిన్ కరెన్సీ, హార్డ్ డిస్క్, కెమెరా... ఆల్ఫ్రెడ్ రోజ్ పాట!

ఇంకో ఐదు నిమిషాల తర్వాత, బ్యాగు మోసుకుంటూ కింది కొచ్చి, ఖరీదైన చెవ్రోలెట్ స్పార్క్ కారెక్కి స్టార్ట్ చేశాడు...

• • •

శవాన్నే చూస్తూ నిలబడ్డాడు వాస్కో పోలీస్ ఇన్‌స్పెక్టర్ బ్రెజ్ మెంజెస్. నరేష్ ఒంటి మీద చాలా కత్తిపోట్లు కన్పిస్తున్నాయి. పైగా మెడకి మూడు కత్తులు గుచ్చుకుని వున్నాయి. ఇంకో రెండు కత్తులు కింద పడున్నాయి... రక్తం మడుగు కట్టింది.

17 కత్తిగాయాలున్నాయని పోస్ట్‌మార్టం రిపోర్టు వచ్చింది. దోపిడీ హత్యగా కేసు నమోదు చేశాడు ఇన్‌స్పెక్టర్ మెంజెస్. ఇంకో వూళ్ళో కారు దొరికింది. నెల రోజుల తర్వాత వాస్కోలో ఒక మొబైల్ షాపులో నరేష్ మొబైల్, లాప్‌టాప్ ట్రేస్ అయ్యాయి. అమ్మిన వాడి పోలికలు చెప్పాడు షాపతను.

ఇంకో రెండు రోజుల తర్వాత పనాజీలో బైక్ మీద స్పీడుగా దూసుకుపోతున్నాడు డయాజ్. సడెన్‌గా బైక్‌ని తిప్పి వెనక్కి ఉరికించాడు. చెకింగ్‌లో వున్న పోలీసులు సైరన్ వేసుకుంటూ కారులో వెంటబడ్డారు. బైక్ వదిలేసి పరుగెత్తడం మొదలెట్టాడు. పరుగెత్త లేక చేతులెత్తి నిలబడ్డాడు.

డ్రైవింగ్ లైసెన్సు అడిగారు, లేదు. బైక్ పేపర్స్ అడిగారు, లేవు.

"ఎక్కడ కొట్టేశావ్ బండి?"

ఏదో నసిగాడు. పోలీస్‌స్టేషన్‌కి తీసికెళ్లారు. ఇదేకాదు, ఇంకో రెండు పోలీస్‌స్టేషన్ల పరిధుల్లో చోరీ అయిన అనేక బైకుల గుట్టు విప్పేశాడు డయాజ్. జేబులు చెక్ చేసి షాకయ్యారు పోలీసులు. దెబ్బలకి తాళలేక "అయ్యో... హబ్బా... చెప్తాను... సార్! చెప్పేస్తాను."

"చెప్పు మరి"

"మర్డర్ చేశా, అప్పుడే ఈ ఫారిన్ నోట్లు తెచ్చుకున్నా!"

వెంటనే వాస్కో పోలీస్‌స్టేషన్‌కి ట్రాన్స్‌ఫర్ ఏర్పాట్లు చేశారు.

మొబైల్ షాపతను వచ్చి గుర్తుపట్టాడు డయాజ్‌ని.

"ఎందుకని ఐదు కత్తులు వాడావ్?" ప్రశ్నించాడు డయాజ్‌ని ఇన్‌స్పెక్టర్ మెంజెస్.

"ఐదేళ్ళప్పుడు అమ్మపోయి నాకు చాలా అన్యాయం జరిగింది"

"షటప్, నాన్సెన్స్"

• • •

"సానుభూతి, సెంటిమెంట్లు చట్టం చూడదు కదా, మిస్టర్ అనెక్ లెటో..."

"సర్...?"

"యావజ్జీవ శిక్ష...ఏమంటారు?" చిరునవ్వుతో చూశాడు జడ్జి.

న్యాయవాది అలెక్ నెటో కోపంగా బయటకొచ్చేసి, "తీర్పు కాపీ అందగానే అప్పీల్ చేస్తా!" అని ఆవేశంగా ప్రకటించాడు మీడియాకి.

ఏ ఎమోషనూ లేకుండా, వ్యానులో తరలిపోతున్నాడు ఇప్పుడు పాతికేళ్ళ స్నేహాల్ డయాజ్ జైలుకి...

**- సికిందర్**



# తళుకుల్లారా... మా ఇంటికి రారా!

**పడకగదిలో అంతరిక్షం... హాల్లో డిస్కో థెక్... లివింగ్ రూములో జెల్లీఫిష్... ఇంటి అందాన్ని జిగేల్మంటూ పెంచే సరికొత్త ఇంటీరియర్ ఐడియాలే ఇవన్నీ.**



## జెల్లీఫిష్ గ్లాస్ టేబుల్

లివింగ్ రూమ్‌లో ఓ సోఫా సెట్, దానెదురుగా ఓ టేబుల్. ఆ గది అందాన్ని పెంచే అమరికే ఇది. అందునా గ్లాస్ టేబుల్ అయితే.. ఆ గ్లాస్ టేబుల్‌కు అదనపు హంగులు ఉంటే ఇంకాస్త అందం. అందుకేనేమో ఓ ఇంటీరియర్ డిజైనర్ తళుకుబెళుకుల 'జెల్లీఫిష్ గ్లాస్ టేబుల్'ను రూపొందించారు. జెల్లీ ఫిష్ తెలుసుగా... పొడవాటి టెంటకిల్స్ (కాళ్లలాంటివి)తో, రంగురంగుల్లో మెరుస్తూ ఉంటుంది. ఆ జీవిని తలపించే గ్లాస్ టేబుల్ ఇది. టేబుల్ కింద భాగం జెల్లీ ఫిష్ టెంటకిల్స్ లాగే ఉంటాయి. ఇంద్రధనుస్సులా ఏడు రంగుల్లోనూ, సింపుల్‌గా సింగిల్ కలర్‌లోనూ తయారుచేస్తున్నారు. అయితే ఓ షరతు. వాటి మీద కూర్చుంటామంటే కుదర్దు. అధిక బరువులు ఇవి మోయలేవు. ఫ్లవర్ వేజులూ పుస్తకాల వరకూ ఫర్వాలేదు.

## ఇంట్లోనే డిస్కోథెక్



డిస్కోథెక్ అనగానే గుర్తొచ్చేవి రంగుల లైట్లు, హోరుమనే సంగీతం... ఆ రంగుల వెలుగుల్లో చిందులేసే యువత. ఆమాటకొస్తే, రాక్ మ్యూజిక్ పెట్టుకుని ఇంట్లో కూడా చిందులేయచ్చు! కానీ, లైట్ల ఎఫెక్ట్ ఎలా వస్తుంది? ఇప్పుడు, ఆ తళుకుబెళుకుల్నీ ఇంటిదాకా తీసుకొస్తున్నారు ఇంటీరియర్ డిజైనర్లు. తలుపులకి రంగురంగుల గ్లాస్ బ్రిక్స్‌ను అమర్చడం ద్వారా ఆ ఎఫెక్టు వచ్చేలా చేస్తున్నారు. అయితే ఆ తలుపు మీద సూర్యకాంతి కానీ, లైటు వెలుగు కానీ పడాలి. అప్పుడే, రంగుల ప్రతిబింబం ఇల్లంతా విస్తరిస్తుంది. ఒక్కసారిగా, రెండువేల రంగులు సకల హంగులతో పుట్టుకొస్తాయి. కిటికీల ద్వారా కూడా ఈ ఎఫెక్ట్ తీసుకురావచ్చు. ఇంకేముంది, ప్రతి వీకెండ్‌కూ మీ ఇల్లు ఫ్రెండ్స్‌తో కళకళలాడిపోతుంది.

## ఫర్నీచర్‌కు మెరుపులు

**హాల్లోని కుర్చీలూ టేబుళ్లూ రాత్రి పూట వెలుగులు విరజిమ్మితే ఇల్లు ఇంద్రధనుస్సును గుర్తుకుతెస్తుంది. మెరుపుల ఫ్లవర్ వేజ్‌లు కూడా మనకు అందుబాటులో ఉన్నాయి. రాత్రిపూట గదిలోని లైట్లన్నీ ఆపేస్తే... కుర్చీలు తన్నుకుని పడిపోతామేమో అన్న భయం ఉండదిక. ఎందుకంటే, ఫర్నీచర్ రంగురంగుల్లో మెరుస్తూ కనిపిస్తుంటాయి. అయితే ఆ ఫర్నీచర్ చెక్కతో చేసింది కాదు... దృఢమైన ప్లాస్టిక్ తయారీ. వాటిలోపల ఎల్ఈడీ బల్బులు బిగించి ఉంటాయి. మాడిపోకుండా బ్యాటరీల్నీ అమరుస్తారు. బ్యాటరీ అయిపోతే మళ్లీ ఛార్జ్ చేసుకునే అవకాశం ఉంది.**



## జిగేల్ జిగేల్ స్విమ్మింగ్ పూల్

మనింట్లో కనుక స్విమ్మింగ్‌పూల్ ఉంటే, దాన్నీ మెరిపించవచ్చు. రాత్రయితే చాలు, అందులోని నీళ్లు గులాబీ, పసుపు, నారింజ రంగుల్లో మారిపోతాయి. మార్పు కోసం రోజుకో రంగును ఎంచుకోవచ్చు. ఇదేం బ్రహ్మవిద్య కాదు, మెరిసే జెల్‌ని స్విమ్మింగ్ పూల్‌లోని నీటి మీద చల్లితే సరిపోతుంది. 'గ్లో క్రిస్టల్స్'ని వెదజల్లినా... ఆ ఎఫెక్టే కనిపిస్తుంది. పార్టీలూ వేడుకలూ జరుగుతున్నప్పుడు... ఆ తళుకులు ప్రత్యేక ఆకర్షణ అవుతాయి. పూల్ కింద వాటర్ ప్రూఫ్ డిస్కో లైట్స్‌ను ఏర్పాటు చేయడమూ మంచి ఆలోచనే. కాకపోతే ఇది కాస్త ఖర్చుతో కూడుకున్న పని.





# వాట్సాప్‌లో కథల నానమ్మ!

**పల్లెలో నానమ్మ... పట్నంలో మనవడు. కలిసేదే ఏడాదికోసారి... ఏ పండక్కో పబ్బానికో! ఇక కథలు చెప్పుకునే తీరికేది. 'అనగనగా...' అనుభూతికి దూరమైన ఆ పిల్లల కోసమే ఓ నానమ్మ... వాట్సాప్‌లో బోలెడు కథలు వినిపిస్తోంది.**

'**అ**నగనగా ఒక రాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు....' పాతికేళ్ల క్రితం దాకా ఈ కథ వినకుండా నిద్రలోకి జారిపోయే బుజ్జిగాళ్లే లేరు. కాకి కథ, కొంగ - నక్క కథ, పిచుక కథ, తాబేలు పరుగు కథ... ఇలా ఎన్నో కథల్ని మనవళ్లనో మనవరాళ్లనో ఒళ్లో కూర్చోబెట్టుకుని చెప్పేవారు నానమ్మలూ తాతయ్యలూ! ఇప్పుడేమో... మనవలు ఒక చోటా, తాతయ్యలూ నానమ్మలూ మరోచోటా! న్యూక్లియర్ కుటుంబాల పుణ్యమాని వారానికో పదిహేను రోజులకో ఓసారి... ఫోన్లో పొడిపొడిగా 'హలో' చెప్పడం తప్పించి, కథలు చెప్పించుకునే అవకాశం లేనేలేదు నేటి పిల్లలకు. ఫలితంగా... కథ అటకెక్కిపోయింది. కంచికెళ్లన ఆ కథలను తిరిగి చిన్నారుల దగ్గరికి చేర్చే ప్రయత్నాలు చేస్తున్నారు... సరళా మిన్ని! ఈమె ఆరువేల మంది పిల్లలకు కథల నానమ్మ. సరళాజీ కథల కోసం ఆత్రంగా వారం వారం ఎదురుచూస్తుంటారు.

**మేనకోడలి చొరవతో...**

బెంగళూరుకు చెందిన సరళ మిన్ని టీచర్‌గా పనిచేసి రిటైర్ అయ్యారు. సాయంత్రాలు మనవళ్లకూ మనవరాళ్లకూ కథలు చెప్పడం ఆమెకు అలవాటు. 'అమ్మమ్మా! మాకూ చెప్పవూ? నానమ్మా మాకూ చెప్పవూ!' అంటూ మిగతా ప్రాంతాల్లో ఉంటున్న బంధువుల పిల్లలూ అడగసాగారు. పసివాళ్లను చిన్నబుచ్చడం ఎందుకని, ఫోన్లో చిన్న చిన్న కథలు చెబుతూ రికార్డు చేసేవారు. ఆ చొరవ తనను వేల మంది పిల్లలకు కథల నానమ్మను చేస్తుందని సరళమ్మ అప్పట్లో అస్సలు ఊహించలేదు. మొదట్లో కథల్ని రికార్డు చేసి వాట్సాప్‌లో బంధువులకు పంపేవారు. ఆ కథలకు పిల్లలు బాగా కనెక్ట్ అయిపోయారు. కొత్త కథ ఎప్పుడొస్తుందా అని ఎదురుచూసేవారు. సరళ మేనకోడలు పారుల్ వాటిని తన స్నేహితులకు కూడా పంపేది. వాళ్ల పిల్లలకూ ఆ కథలు భలేగా నచ్చాయి. దీంతో, మరిన్ని పంపమని అడగసాగారు. అప్పుడే, పారుల్‌కు ఓ ఆలోచన వచ్చింది. వాట్సాప్‌లోనే 'కహానీవాలీ నానీ' పేరుతో ఒక గ్రూపు క్రియేట్ చేశారు. ఆ గ్రూపులోనే కథల ఆడియోలు పోస్టు చేస్తారు. ఒక్కో కథ ఎనిమిది నిమిషాల నిడివి ఉంటుంది. హిందీ, ఆంగ్ల భాషల్లో కథలు ఉంటాయి. ఈ గ్రూప్ మొదలై నాలుగైదు నెలలే అయినా, ఇప్పటికే ఆరువేల మంది సభ్యులయ్యారు. యూకే, అమెరికా, ఆస్ట్రేలియా, నైజీరియా దేశాల నుంచి కూడా పిల్లలు ఆమె కథలు వింటున్నారు.

**భలే ఆనందం...**

ప్రపంచవ్యాప్తంగా తన కథలకు లభిస్తున్న ఆదరణను చూసి సరళమ్మ సంతోషపడిపోతోంది. 'కథలు చెప్పించుకోవడం, వినడం, పిల్లల జన్మహక్కు' అంటారామె. అందుకే వారిలో మంచిని పెంపొందించే కథలే తాను చెబుతుంటానని వివరిస్తారు. ఓసారి కథల నానమ్మకు కశ్మీర్ నుంచి ఫోన్ కాల్ వచ్చింది. ఒక మహిళ మాట్లాడుతూ... తాము పాక్ సరిహద్దుకు 30 కిలోమీటర్ల దూరంలో నివసిస్తామనీ... ఇంటర్నెట్ ఎప్పుడు ఉంటుందో కూడా తెలియదనీ చెప్పింది. ఇంటర్నెట్ రాగానే వాట్సాప్ గ్రూప్‌లోని కథలను డౌన్‌లోడ్ చేసుకుంటాననీ, రాత్రిపూట జోకొడుతూ ఆ కథలే వినిపిస్తాననీ ఉద్వేగంగా చెప్పుకొచ్చింది. ఆ స్పందన కథల నానమ్మకు మరింత శక్తినిచ్చింది. తన గొంతు చాలా మృదువుగా ఉంటుందనీ, వాడుక భాషలోనే తాను కథలు చెబుతాననీ... ఏ కథా పునరావృతం కాలేదనీ ఇవే తనను పిల్లలకు దగ్గర చేశాయనీ అంటారు సరళ మిన్ని. కథల్ని రికార్డు చేస్తున్నప్పుడు... తన మనవళ్లూ మనవరాళ్లూ ఎదురుగా కూర్చుని వింటున్నట్టే ఫీలవుతూ చెబుతారు నానమ్మ. అందుకే ఆ కథల్లో అంత జీవం ఉంటుంది. ఆమె కొడుకూ కోడలూ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు. సరళమ్మ కథల్ని వెబ్‌సైట్ ద్వారా మరింత మందికి దగ్గర చేసేందుకు వారు ప్రయత్నిస్తున్నారు.

మీ పిల్లలకూ సరళ నానమ్మ కథలు వినిపించాలని ఉందా? అయితే మీ బాబు లేదా పాప పేరు, వయసు, భాష (హిందీ లేదా ఆంగ్లం) మొదలైన వివరాలను 8867615400కు వాట్సాప్ చేయండి. ఇక నుంచీ ప్రతివారం ఒక కథ పంపుతారు. అందుకు ఎలాంటి రుసుమూ వసూలు చేయరు. ఇది నానమ్మ భరోసా! ❇





**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుతం అభివృద్ధి చెందిన దేశాలలో మరియు పట్టణ ప్రాంతాలలో నివసించే వారిలో ఎక్కువ శాతం కనిపించే చర్మ సమస్య ఎగ్జిమా. ఈ ఎగ్జిమాలో ఎన్నో రకాలు ఉన్నప్పటికీ, వాటిలో సర్వసాధారణంగా ఎక్కువ మందిని వేధించే వ్యాధి అటోపిక్ డెర్మటైటిస్. ఇది ఏ వయస్సు వారిలోనైనా ఏర్పడుతుంది. ఇది ముఖ్యంగా శిశువులలో 65% వరకు మరియు 5 సం॥ల వయస్సులోపు చిన్నపిల్లలలో 85% వరకు కనిపిస్తుంది. కొంతమందిలో కేవలం చిన్న వయస్సు వరకే పరిమితమయ్యే ఈ సమస్య మరికొందరిలో జీవితకాలం కొనసాగుతుంది. పొడి చర్మం గల వారిలో మరియు చల్లని వాతావరణం ఉన్న సమయాలలో ఇది మరింత ఎక్కువగా కనిపించే అవకాశం ఉంటుంది.

'అటోపిక్ డెర్మటైటిస్' అనేది దీర్ఘకాలికంగా కొనసాగే చర్మ సమస్య. ఇది తలెత్తిన వారిలో చర్మంపై వెలుపలి పొరలు శోథమునకు గురి అయి ఎర్రబడటం, దురద పెట్టటం, వాపుతో కూడిన పొక్కులు ఏర్పడి - నీటి బుడగల వలె మారి రసికారడం, తదుపరి మచ్చలా ఏర్పడటం జరుగుతుంది. శరీరంలో ఎక్కడైనా ఏర్పడే ఈ వ్యాధి లక్షణాలు - ఎక్కువగా మోకాలు వెనుక భాగం, మోచేయి, మణికట్టు మడతలలో, మెడపైన, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తాయి.




# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'అటోపిక్ డెర్మటైటిస్' సమస్యకు సరైన పరిష్కారం

## Atopic Dermatitis:

**కారణాలు:** 'అటోపిక్ డెర్మటైటిస్'కు గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ శరీర రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడంతో డెర్మటైటిస్ లక్షణాలు ఏర్పడతాయి. ఇంతే కాకుండా - ఉబ్బసం, తీవ్రజ్వరం మొదలగు సమస్యలను ఎదుర్కొనే వ్యక్తిగత చరిత్ర కలిగి ఉండటం మరియు శ్వాస సంబంధిత అలర్జీ తలెత్తడం, కొన్ని రకాల అలర్జీలను కలిగించే ఆహార పదార్థాలను తినడం, రోగనిరోధక శక్తి తక్కువగా ఉండటం మరియు కుటుంబ చరిత్ర కలిగి ఉండటం వంటి కారణాల వలన ఈ 'అటోపిక్ డెర్మటైటిస్' సమస్య ఎక్కువగా ఏర్పడుతుంది.

**ప్రేరేపితాలు:** ముఖ్యంగా పొడి చర్మం ఉన్నవారిలో ఈ వ్యాధి ఎక్కువగా కలుగుతుంది. దుమ్ము-ధూళి, పుప్పొడి రేణువులు, జంతు కేశాలు, సబ్బులు, డిటర్జెంట్‌లు, షాంపూలు, కొన్ని ఆహార పదార్థాలు (ఉదా:- పాలు, గుడ్లు, సోయా), కొన్ని రసాయనాలు, సౌందర్య సాధన సామాగ్రి, వాతావరణ మార్పులు, ఉన్ని వస్త్రాలు, కొన్ని రకాల బ్యాక్టీరియా ఇన్‌ఫెక్షన్‌ల వలన మరియు మానసిక ఒత్తిడి వలన కూడా ఈ వ్యాధి ప్రేరేపించబడుతుంది.

**లక్షణాలు:** ఈ వ్యాధి వలన కలిగే లక్షణాలు ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి వేరుగా ఉంటాయి. ఈ వ్యాధిలో కనిపించే ముఖ్య లక్షణం దురద. ఆ తరువాత చర్మం ఎర్రగా మారి - వాపుతో కూడిన పొక్కులు ఏర్పడతాయి. క్రమేణా ఇవి నీటి బుడగలుగా మారి, వాటి నుండి రసి కారడం, కొంత కాలానికి చర్మం దళసరిగా మరియు నల్లగా మారిపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. • చర్మంపై ఎక్కడైనా ఏర్పడే ఈ వ్యాధి ఎక్కువగా ముఖంపై కనబడటంతో పాటు, తలలో, మోకాలు వెనుక భాగంలో, మెడపైన, మోచేయి భాగంలో, మణికట్టు చర్మపు మడతలలో, చెవి వెనుక భాగంలో, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తుంది. ఇది శిశువులలో మొదట బుగ్గలపై దద్దుర్లుగా కనిపిస్తుంది. కొన్ని నెలలకు ఈ దద్దుర్లు, చేతులు-కాళ్ళతో పాటు ఇతర శరీర భాగాలకు కూడా వ్యాపిస్తాయి. 80% వరకు ఈ వ్యాధితో బాధపడే చిన్నపిల్లలు - హే ఫీవర్ లేదా ఆస్తమాకు గురయ్యే అవకాశం ఉంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలతో బాటుగా కుటుంబ ఆరోగ్య చరిత్ర మరియు వ్యక్తిగత ఆరోగ్య చరిత్ర - ఈ రెండింటినీ క్షుణ్ణంగా తెలుసుకుని ఈ వ్యాధిని నిర్ధారిస్తారు. బాహ్యపరీక్ష, అవసరమైతే రక్తపరీక్ష (ఈ వ్యాధి ఉన్నవారిలో తెల్లరక్తకణాలు (Eosinophils) మరియు సీరమ్ IgE స్థాయిలు ఎక్కువగా ఉంటాయి) మరియు కొన్ని సందర్భాలలో చర్మపు మచ్చల నిర్ధారణకై బయాప్సీ చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** కాన్‌స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'అటోపిక్ డెర్మటైటిస్'ను పూర్తిగా నయం చేస్తారు. ఈ పద్ధతిలో ఉబ్బసం-డెర్మటైటిస్ బాధితులకు, మొదటగా ఉబ్బసం, అనంతరం డెర్మటైటిస్ తగ్గుతుంది. ఈ విధంగా శరీర అంతర్గత అవయవాలు మొదలుకొని, బాహ్య అవయవాల వైపుకు వ్యాధి నివారణ ప్రక్రియ కొనసాగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో వ్యాధి రీత్యా - రోగి శరీర నిర్మాణం మరియు రోగి వ్యక్తిగత, మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించబడే చికిత్సతో ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.

HOMEOCARE INTERNATIONAL
హోమియోకేర్® ఇంటర్‌నేషనల్
వరల్డ్-క్లాస్ హోమియోపతి

టోల్ ఫ్రీ 1800 108 1212
కన్సల్టేషన్ ఉచితం
955 000 1199
www.homeocare.in

ADVT

# ఏడుకానాల వంతెన

ఉణుదుర్తి సుధాకర్

**ముందురోజు రాత్రి పోలీసులకు పట్టుబడిన కుర్రాడు బక్కపల్చగా, లేతగా, నిర్లక్ష్యంగా ఉన్నాడు. ఏడుకానాల వంతెనపై అతని చేతుల్ని తాడుతో వెనక్కి విరిచికట్టి నిలబెట్టారు. అతని చురుకు చూపు, నూనూగు మీసాలు, హవాయి చెప్పులు, లూజు పేంటు, టెర్రీకాట్ షర్టు చూస్తే అతడొక గ్రామీణ హైస్కూల్ లేదా హైయ్యర్ సెకెండరీ స్కూల్ విద్యార్థి అని తెలుస్తోంది. మహా అయితే పద్దెనిమిదేళ్లు.**





పేరుకి ఏడుకానాల వంతెనే గాని, నాలుగే మిగిలాయి. ఎప్పుడో బ్రిటీషువాళ్లు కట్టించినది. నల్లటి రాతికట్టుడు స్తంభాల మీద పిచ్చిమొక్కలూ, గడ్డీ, గాదరా. తుప్పెక్కిన పట్టాలు - స్లీపర్లతో సహా గాలిలో వేలాడుతూ. పక్కనే కట్టిన కొత్తవంతెన మీదనే రైళ్లు వెళతాయి. హౌరా మెయిల్ రావడానికి రెండు గంటలుంది. మెడ్రాస్ మెయిల్ ఎప్పుడో వెళ్లిపోయింది.

"పిలవగానే రాకుండా ఎక్కడరా తిరుగుతున్నావు? గాడిదా ... ఇప్పుడింకా ఏవయినా ట్రైన్లు వస్తాయా... సరిగ్గా చెప్పరా, అడ్డగాడిదా!" అని సర్కిల్ ఇన్‌స్పెక్టర్, రైల్వే గేట్‌మేన్ని గద్దించాడు చిరాగ్గా, కోపంగా. ఇన్‌స్పెక్టర్ చాలా టెన్షన్‌లో ఉన్నాడని తెలుస్తూనే ఉంది.

"గంట లోపల రెండు గూడ్సు బళ్లు రావాలి సార్. ఒకటి అప్పు, ఒకటి డౌను. ఏడు తరవాత మళ్లీ ఈస్టుకోస్టు. అదెప్పుడూ లేటే... దాంతరవాత పూరీ పాసింజరు... అదేరోజెప్పుడొస్తుందో భగవంతుడికే తెలియాలి..." చెప్పుకుపోతున్నాడు ఎర్ర, ఆకుపచ్చ జెండాలు చుట్టి చంకలో పెట్టుకున్న సోడాబుడ్డీ కళ్లద్దాల రైల్వే ఉద్యోగి.

"సరే, సరే ... నువ్వెళ్లి కేబిన్లో కూర్చో. ఒకవేళ రైలేదయినా వస్తే గనక ఆపుచెయ్యి; నేను చెప్పేంతవరకూ సిగ్నల్ ఇవ్వకు."

"చిత్తం" అని వెళ్లిపోయాడు గేట్‌మేన్. వెర్రిబాగులవాడిలా కనిపిస్తాడుగాని అతనికంతా అర్థం అవుతూనేఉంది. 'జనశక్తి' చదువుతాడు. నాగిరెడ్డి గ్రూపుకి సానుభూతిపరుడు. ఇక్కడేదో తేడాగా ఉందనీ, అర్జెంటుగా ఏదో ఒకటి చెయ్యమనీ పక్కూర్లో ఉన్న కామ్రేడుకి చీటీరాసి, కొడుకు చేతికిచ్చి హడావుడిగా వచ్చాడు.

క్లోజ్రేంజిలో త్రీ-నాట్-త్రీ రైఫిల్ తో కాల్చి చంపడం కొంచెం అతిగా ఉంటుందని సీఐకి అనిపించింది. పోస్టుమార్టంలో నానా కంగాళీ అవుతుంది. తన సర్వీస్ రివాల్వర్ వాడడమే పకడ్బందీగా ఉంటుందని అతని భావన.

అతనేంచేసినా బాగా ఆలోచించి చేస్తాడని డిపార్టుమెంటులో పేరు గడించాడు. అయినదానికీ, కానిదానికీ అతిగా ఆలోచించి పీకల మీదకి తెచ్చుకుంటాడని కిట్టనివాళ్లంటారు. ఈసారి మాత్రం నిజంగానే మంచి పథకం వేసుకున్నాడు; నమ్మశక్యంగా ఉండే కథనం ఒకటి తయారుచేసి పెట్టుకున్నాడు:

'రైల్లో తీసుకొస్తూంటే నేరస్తుడు బాత్రూంకి వెళ్తానని చెప్పి వెంటవచ్చిన కానిస్టేబులు చేతుల్లోంచి రైఫిల్ లాక్కున్నాడు. ఆ గలాటా విని తను లేచి వెళ్లేసరికి రైఫిల్ని తనమీదకి తిప్పడంతో సర్వీస్ రివాల్వర్‌తో కాల్చడంతప్ప ఆత్మరక్షణకు మరోమార్గం లేకపోయింది. తలకు గాయమై రక్తం కారుతున్నా, వంతెన రాగానే నేరస్తుడు రైల్లోంచి దూకేశాడు. పరారీలో ఉన్న నేరస్తుడి కోసం దిగువ గ్రామాల్లో గాలింపు చర్యలు చేబట్టాము' - ఈవిధంగా రిపోర్ట్ రాయించమని స్టేషన్లో హెడ్డు గారికి పురమాయించి వచ్చాడు.

'సీఐగానే రిటైరైపోతానా లేక అనుకోకుండా

తగిలిన ఈ బంగారు అవకాశాన్ని వాడుకొని మరో ప్రమోషన్ దక్కించుకుంటానా? లేదంటే ఎటూ కాకుండా తన బాస్, శ్రీకాకుళం డీఎస్పీ మొత్తం క్రెడిట్ కొట్టేస్తాడా?' ఏ సంగతీ తేల్చుకోలేకపోతున్నాడు. డీఎస్పీ దొరగారి చొరబాటుకి అవకాశం లేకుండా తొందరగా ఈ కార్యక్రమం ముగించాలి; ఏది ఏమైనా సరే, ఈ కేసులో మాత్రం తన పేరే ముందుండాలని ఒక నిర్ణయానికి వచ్చేశాడు. నిన్నగాక మొన్న డీఐజీ అంతటివాడు స్టేషన్‌కి ఫోన్చేసి మరీ ఆర్డర్ పాస్ చేసేశాడు? ఇకమీదట దొరికినవాళ్లను దొరికినచోటే ఫినిష్ చేసెయ్యాలనీ, తేడా వస్తే తనే స్వయంగా చూసుకుంటాననీ. డీఎస్పీకి ఫోన్ చేస్తే, చాలా బిజీగా ఉన్నాను, డీఐజీ దొర చెప్పినట్టే కానిమ్మన్నాడు. 'ఏమిటో, ఈయనగారికన్ని రాచకార్యాలు? ఏది ఎలాగున్నా తన సర్వీసు చివరిదశలో ఇదో గొప్ప అవకాశం. పెద్ద రిస్కు కూడా'.

ముందురోజు రాత్రి పట్టుబడ్డ యువకుడు ఎంతకొట్టినా ఏమీ చెప్పాడు కాడు. ఇప్పుడైనా కాళ్లావేళ్లాపడతాడేమో, ఏడుపులంకించుకుంటాడేమో అనుకున్న సీఐకి ఒకింత ఆశ్చర్యం కలిగింది. చిన్నచిన్న జేబుదొంగలు కూడా దొరికిపోయాక కాళ్లు పట్టుకోవడం, లంచమిచ్చుకోవడం - ఇవన్నీ అతనికి బాగా అనుభవం. ఈ కుర్రాడిలో భయం అన్నది కనిపించపోయేసరికి సీఐకి లోలోపల మీమాంస పట్టుకుంది. రేప్పొద్దున్న ఏ ఎంక్వైరీయో మొదలైతే? ఒక్క రిమార్కు కూడా లేకుండా కాపాడుకుంటూ వచ్చిన సర్వీసంతా మంట గలిసిపోతుంది.

• • •

ఆ కుర్రవాడి పేరు కోట పెదబాబు; ఊరు బొడ్డపాడు. ఆ అరుణాకాశపు సాయంత్రాన దూరంగా తూర్పు కనుమల నడుమ అస్తమిస్తూన్న సూర్యుడిని తదేకంగా చూస్తున్నాడు. 'పీకే తప్పించుకున్నాడా లేదా? కబురు అందిందా లేదా?' ఎంతసేపూ ఇదే అతని ఆలోచన. ఎదురుగా ఆనాటి పచ్చటి సాయంత్రపు వెలుగులో, సిల్వర్ పెయింటు పులుముకొని ఠీవిగా మెరుస్తున్న కొత్త ఉక్కువంతెన. పోలీసులన్నాక అరెస్టు చేస్తారని తెలుసు; నాలుగు తగల్నిస్తారనీ, కేసుపెట్టి జైలుకి పంపిస్తారని కూడా తెలుసు. మరీ హడావుడంతా దేనికి? ఊరికే భయపెట్టడానికి అయ్యుంటుంది; లేక నిజంగానే చంపుతారా?.. ఒక్క క్షణం అతని వెన్నువెంట భయం సర్పం జరజరా పాకింది. మరునిముషంలోనే దుఃఖంతో కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

పెదబాబు ఏడు కానాలవంతెన పైనుండి కిందికి చూశాడు, సుడులు తిరుగుతూ వడిగా ప్రవహిస్తున్న వాగు సూర్యాస్తమయపు బంగారుకాంతుల చిరుకెరటాలతో తనకు వీడ్కోలు చెబుతూన్నట్టుగా తోచింది; తనను ఆహ్వానిస్తున్నట్టుగా కూడా అనిపించింది. అతను కాసేపు కళ్లుమూసుకున్నాడు. అమ్మనీ, నాన్ననీ, ప్రాణమిత్రులు దుష్యంతనీ, పొందల బాలకృష్ణనీ గుర్తుచేసుకుంటూ? అలాగే పాటలు పాడే తన క్లాస్మేటు - చిన్నప్పటినుండీ చేరువగా ఉంటూన్న స్నేహితురాల్ని కూడా. అతననుకున్నాడు, నా చేతుల్ని గనక విడిపించుకోగలిగితే ఇప్పుడే దూకేస్తాను; ఈదుకుంటూ వెళ్లిపోతాను? ఉధృతంగా ప్రవహిస్తూన్న వాగువెంబడే? మేనమావల ఊరివైపుగా; అదే, అమ్మపుట్టిన ఊరు ... అతని ఆలోచనలు ముందుకి పరుగెత్తుతున్నాయి ...

ధైర్యం చేసి దూకేశాడు. శక్తికొద్దీ ఈదుతున్నాడు; వాగు తన ప్రవాహవేగంతో ఏడుకానాలవంతెన నుండి తనను దూరంగా లాక్కుపోతోంది. అబ్బో, పారిపోతే పోలీసులు ఊరుకుంటారా? తమ రైఫిల్స్ ని గురిపెడతారు. తూటాల వర్షం? నీళ్లు మరుగుతున్నట్టుగా. అదృష్టవశాత్తూ ఆ తూటాలేవీ తనను తాకవు. హమ్మయ్య, బతికిపోయాను. చీకటిపడుతోంది. తూటాల మృత్యు సంరంభం ఆగిపోయింది. ఇప్పుడిక అంతటా నిశ్శబ్దం - వాగు తన చిరుకెరటాలతో ఒడ్డునచేస్తున్న మృదుసవ్వడి తప్ప; అదొక జోలపాట. బాగా అలసిపోయి ఒడ్డుకి చేరుకొని, అతి కష్టంమీద లేచి నిలబడ్డాడు; అడుగులు బరువుగా పడుతున్నాయి. హవాయి చెప్పులు ఎప్పుడో జారిపోయాయి. తడిసిన చొక్కా, బురద పేంటూ ఒంటికి అంటుకుపోయాయి; చలీ, చిన్నగా వణుకు. చీకటి పడింది. గుడ్డివెన్నెల. కప్పల బెకబెక. నక్షత్రాల మిలమిల. అమ్మమ్మ చిన్నప్పుడు చూపించింది - అదిగో, అదే సప్తరుషిమండలం.

“
పెదబాబు కళ్లకు గంతలు కట్టారు. చీలమండల వద్ద రెండుకాళ్లూ కలిపి కట్టారు. సీఐ తన సర్వీస్ రివాల్వర్ లోడ్ చేసి, సేఫ్టీ కాచ్‌ని రిలీజ్ చేశాడు. రెండుచేతులతోనూ పట్టుకొని బందీ తలవెనుక రివాల్వర్ని గురిపెట్టాడు; అదికాస్తా చేతుల్లోంచి జారిపోతుందేమో అన్నంతగా అతనికి చెమటలుపట్టాయి .. ఆ ఏడుకొండలవాడి మీద భారంపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు.
”

చెరువుగట్టున నడుస్తున్నాడు. మూకుమ్మడిగా నక్కలు అరిచాయి. నార కోసం జనపకట్టల్ని చెరువులో నానబెట్టినట్టున్నారు? అబ్బ! ఒకటే వాసన. మర్రిచెట్టు కింద చిమ్మచీకట్లో కొత్తగా సున్నం వేసిన అమ్మవారిగుడి, తెల్లగా? చిన్ననాటి భయాల్ని గుర్తు చేస్తూ. దూరంగా కరెంటుదీపాలు; అదే ఊరు చెప్మా? ఎవరైనా కనిపిస్తే అడగాలి. ఇప్పుడు అడుగులు వడిగా పడుతున్నాయి.

కోపిష్టి పెద్దమావయ్య తనని ఇంట్లోకి రానిస్తాడా? ఈ ఒక్క రాత్రికైనా? మావయ్యకూతురు తన అవతారం చూసి నవ్వుతుందా? ... ఇంతకీ పీకే తప్పించుకున్నాడో లేదో? అరెస్టు చెయ్యడానికి సోంపేట, ఇచ్ఛాపురం స్టేషన్ల పోలీసు బృందాలు మాటువేసి ఉన్నాయనే కబురు అతనికి చేరిందో లేదో?... మళ్లీ అవే ప్రశ్నలు ముసురుకున్నాయి, అతని ఊహలను చెదరగొడుతూ.

• • •

పెదబాబు కళ్లకు గంతలు కట్టారు. చీలమండల వద్ద రెండుకాళ్లూ కలిపి కట్టారు. సీఐ తన సర్వీస్ రివాల్వర్ లోడ్ చేసి, సేఫ్టీ కాచ్‌ని రిలీజ్ చేశాడు. రెండుచేతులతోనూ పట్టుకొని బందీ తలవెనుక రివాల్వర్ని గురిపెట్టాడు; అదికాస్తా చేతుల్లోంచి జారిపోతుందేమో అన్నంతగా అతనికి చెమటలుపట్టాయి. ఈ అధ్యాయం గనక సవ్యంగా ముగిసిపోయి తనకు ప్రమోషన్ గానివస్తే సకుటుంబంగా తిరుపతివచ్చి గుండు గీయించుకుంటానని మొక్కుకున్నాడు. ఆ ఏడుకొండలవాడి మీద భారంపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు.

ధనేల్మని ప్రేలుడు.

కుర్రవాడు కుప్పకూలాడు. కపాలం విచ్చుకుంది; రక్తపుధార.

వెంట ఉన్న కానిస్టేబుల్స్, శ్వాస నిలిచిపోయిందని నిర్ధారించుకొని తాళ్లు, గంతలు గబగబా విప్పేశారు. శవాన్ని వాగులోకి తోశారు; దబ్బుమనిపడింది. ప్రవాహానికి కొట్టుకుపోతోంది. కానిస్టేబుల్లిద్దరూ గుడ్లప్పగించి చూస్తున్నారు.

“ఇంక పదండి” అని వాళ్లని తొందరపెట్టాడు సీఐ.

ముగ్గురూ మౌనంగా రైలు పట్టాల వెంబడి, లెవెల్ క్రాసింగ్ వద్ద నిలుపుచేసిన జీపువైపు నడుస్తున్నారు; ఎవరి ఆలోచనల్లో వాళ్లు. దూరంగా గూడ్సురైలు సిగ్నల్ కోసం కూతపెట్టింది. అంతలోకే హెడ్డు పట్టాల వెంటపరుగెత్తుకుంటూ, ఆయాసపడుతూ వస్తున్నాడు. చేతిలో ఉన్న వైర్లెస్ మెసేజి కాపీని ఊపుతూ,

“సార్, సార్... కృష్ణమూర్తి దొరికిపోయాడు” అని దూరంనుండే అరిచాడు.

• • •

సుమారు ఏభై ఏళ్లనాటి సంగతి. ఆరోజు ఉదయాన్నే కలకత్తానుండి వస్తూన్న పంచాది కృష్ణమూర్తినీ, మరో ఆరుగుర్నీ సోంపేట (కంచిలి) రైల్వేస్టేషన్ వద్ద అరెస్టు చేశారు. ఆరాత్రే ఒడిషా సరిహద్దులోని జలాంతరకోట కొండల్లో వారందరినీ చంపేశారు. సరిగ్గా అప్పుడే ఎన్ కౌంటర్ అనేమాట తెలుగుభాషలోకి ప్రవేశించింది; నేటికీ వాడుకలో ఉంది.

*(ఏంబ్రోస్ బియర్స్ (అమెరికన్ రచయిత, 1842 - 1914 ?) రచించిన సుప్రసిద్ధ కథ 'ఏన్ అక్కరెన్స్ ఎట్ అవుల్ క్రీక్ బ్రిడ్జ్'ని గుర్తుచేసుకుంటూ... )*

---

sudhakarudu@gmail.com

# మిక్సర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## ఆవాసనం

**ఆ**వాలు బరువు తగ్గించుకోవడానికి ఎంతో ఉపయోగపడతాయి. ఎలా ఉపయోగించాలో తెలుసుకుందాం.

ముందుగా ఒక కిలో ఆవాలను గచ్చు నేల మీద వేయాలి. ఆ తర్వాత ఒక ఖాళీ గిన్నెను ఎత్తైన గట్టుమీద ఉంచాలి. ఇప్పుడు ఒక్కో ఆవ గింజనూ ఏరి ఆ గిన్నెలో వేయాలి. ఆవాలు మొత్తం గిన్నెలోకి వచ్చేదాకా ఇలా చేస్తూనే ఉండాలి. ఇలా వారానికి మూడు సార్లు చేయాలి. రెండు నెలల్లో మీరు సన్నగా అవ్వడం గ్యారెంటీ!

**గమనిక:** ఆవాలకు బదులుగా గసగసాలు కూడా వాడవచ్చు.



## దొందూ దొందే

**హరి:** నా భార్యకు వంట చేయడం బాగా వచ్చు. అయినా ఏ రోజూ వంట చేయదు.

**గిరి:** అయితే నువ్వు చాలా అదృష్టవంతుడివి.

**హరి:** ఎందుకని?

**గిరి:** నా భార్యకు వంట చేయడం అస్సలు రాదు. అయినా రోజూ వండి పెడుతుంది.

## డ్రింక్ అండ్ కాల్

**తండ్రి (ఫోన్‌లో) :** తాగినప్పుడు కారు నడపకు నాన్నా!

**కొడుకు:** నువ్వు తాగినప్పుడు కాల్ చేయకు నాన్నా.

**తండ్రి:** నీకెలా తెలుసురా నేను తాగుతున్నానని!

**కొడుకు:** నువ్వు నాకు కారు ఎప్పుడు కొనిచ్చావ్ నాన్నా?



## దూరాలోచన

**"ప**రీక్ష పాసయితే బైక్ కొనిస్తానని చెప్పా కదరా ... మరెందుకు ఫెయిలయ్యావు?" నిలదీశాడు తండ్రి.

"టైమంతా బైక్ నేర్చుకోవడానికే సరిపోయింది డాడీ! చదవడానికి కుదర్లేదు" నిజాయతీగా చెప్పాడు కొడుకు.

## యాడ్స్‌లో జీవితం

**కా**లేజీ జీవితం జియో సిమ్ లాంటిది, ప్రపంచమంతా మన చేతుల్లోనే ఉంటుంది.

బ్యాచిలర్ జీవితం ఎయిర్‌టెల్ లాంటిది, అంత స్వేచ్ఛ ఎక్కడా ఉండదు.

ఎంగేజ్‌మెంట్ ముందు జీవితం ఐడియా లాంటిది, ఒక్క ఐడియా మీ జీవితాన్నే మార్చేస్తుంది.

పెళ్లయ్యాక వొడాఫోన్, ఎక్కడికెళ్లినా నెట్‌వర్క్ ఫాలో అవుతుంది.

పిల్లలు పుట్టాక బీఎస్ఎన్ఎల్, అన్ని లైన్లూ ఎప్పుడూ బిజీగా ఉంటాయి.

ఓవరాల్‌గా ఇదీ జీవితమంటే!



ఈ వారం కవిత

## ఊరూ వానా ...



**వ**ర్షాన్ని ముందేసుకుని నేను
వరండాలో కూర్చున్నాను

కాన్వెంటు బస్సులోంచి
తుర్రుమని బయటకొచ్చిన తూనీగలు
ఎక్కడ పని అక్కడే వదిలేసి
వీధిలో ఇళ్లన్నీ ఒకటే హడావుడి
రంగుల ధారల్లో రాగాలు తీసిన వాన

వీధి మొగలో గేదె ఒకటి వొళ్లు విదిలిస్తే
మా ఇంటి పక్క చెరువు
కాస్త పక్కకు తొలగింది

అవయవాలకు తాకకుండా
తడి వస్త్రాలను విదిలిస్తూ ఎవరో ఆడవాళ్ల గుంపు
వార్నీ అంటూ వంద వంకర్లు తిరిగిన వాన

చెరువుల్ని నింపుకుని పోతున్న ట్రక్కుల నీడల్లో
మునగదీసుకు పడుకున్న వరి పొలాలు
ఆకాశంలోంచి పొడవాటి వెండి అద్దాల్లా కురిసిన చేపలూ రొయ్యలూ
ముసురు పట్టిన మనసుకు మూత పెట్టి
ఖాళీ శరీరాన్ని పెదవిలా విరిచిన ఊరు

అన్నీ తెలిసిన వాన
ఎవరెన్ని వేషాలు మార్చినా నా పని నాదేనంటూ
మా ఊరి బుగ్గ గిల్లి
ఈవేళకి వెళ్లొస్తానని
ఇంద్రధనుస్సుల చేతులూపి టాటా చెప్పింది

ఊరి పొయ్యిలో తడిసి ఆరిన
నాగలి మొద్దులు .. బండి చక్రాల కొయ్యలు
పాత జ్ఞాపకాల పొగలు కక్కాయి

వానాకాలం ఊరొస్తే అంతే
పొద్దు వాలకుండానే
ఆకాశం తలుపులు మూసుకున్నట్టు
మనసులో కాస్త వెలుతురు .. కాస్త చీకటితో
తిరుగు ప్రయాణం కట్టాలి
వాన మాత్రం ఒంట్లో ఏదో మూలని తడుపుతూనే వుంటుంది

**- ప్రసాదమూర్తి,** 84998 66699

# అరటి: రుచిలో ఏదీ సాటి!



## దూట పచ్చడి

**కావలసిన పదార్థాలు**

అరటి దూట - పది సెంటీమీటర్ల పొడవుది, అల్లం - అర అంగుళం ముక్క, పచ్చిమిర్చి - 3, పెరుగు - ఒక కప్పు, పచ్చికొబ్బరి తురుము - ఒక టేబుల్ స్పూను, ఆవాలు, మినప్పప్పు, ఇంగువ - అర టీ స్పూను చొప్పున, కరివేపాకు - 4 రెబ్బలు, నూనె - ఒక టీ స్పూను, ఉప్పు - రుచికి తగినంత.

**తయారుచేసే విధానం**

నార తీసి శుభ్రం చేసిన దూటని చాలా చిన్న ముక్కలుగా తరిగి (నల్లబడకుండా మజ్జిగలో వేసి) కొద్దిసేపు ఫ్రిజ్‌లో ఉంచాలి. తర్వాత తగినంత నీటిలో ఉప్పు వేసి ఉడికించాలి. ఈలోపు కొబ్బరితురుము, పచ్చిమిర్చి, అల్లం కలిపి రుబ్బుకోవాలి. (వడకట్టి చల్లారిన) దూట ముక్కల్లో అల్లం మిశ్రమం, పెరుగు, ఉప్పు వేసి బాగా కలిపి తాళింపు జతచేయాలి.

## పువ్వు కూర

**కావలసిన పదార్థాలు**

(మీడియం సైజు) అరటి పువ్వు - ఒకటి, శనగపప్పు - ఒక కప్పు, కందిపప్పు - ఒక (చిన్న సైజు) కప్పు, ఎండుమిర్చి - 6, జీలకర్ర, ఇంగువ - అర టీ స్పూను చొప్పున, ఉప్పు - రుచికి తగినంత, నూనె - పావు కప్పు.

**తయారుచేసే విధానం**

పప్పుల్ని రెండు గంటల పాటు నానబెట్టాలి. పువ్వు రెమ్మల్లో కాడ లేకుండా శుభ్రం చేసి, సన్నగా తరిగి పసుపు కలిపిన నీటిలో ఉంచాలి. పప్పులు, ఎండుమిర్చి, జీలకర్ర, ఇంగువ, ఉప్పు కలిపి నీరు కలపకుండా రుబ్బుకోవాలి. నీరు పిండిన పువ్వు తరుగులో శుభ్రమైన నీరు పోసి 4 విజిల్స్ వచ్చేవరకు ఉడికించాలి. ఇప్పుడు నూనెలో తాళింపు వేసి రుబ్బిన పప్పు మిశ్రమం కూడా కలిపి, సగం ఉడికిన తర్వాత ఉడికిన పువ్వు తరుగు కలపాలి. చిన్నమంటపై నీరంతా ఇగిరిపోయేవరకు ఉంచి దించేయాలి. అన్నంతో పాటు నెయ్యి వేసుకుని తింటే ఎంతో రుచిగా ఉంటుంది. ఆరోగ్యరీత్యా నెలకొకసారి అయినా తింటే మంచిదంటారు.

---

## పాన్ కేక్స్

**కావలసిన పదార్థాలు**

బాగా పండిన అరటి - ఒకటి, మైదా - ఒకటిన్నర కప్పులు, పంచదార - 2 టేబుల్ స్పూన్లు, బేకింగ్ పౌడర్ - రెండున్నర టీ స్పూన్లు, ఉప్పు - అర టీ స్పూను, పాలు - ఒక కప్పు, గుడ్లు - 2, వెనీల ఎస్సెన్స్ - అర టీ స్పూను, బటర్ - 3 టేబుల్ స్పూన్లు, నూనె - కాల్చడానికి సరిపడా.

**తయారుచేసే విధానం**

ఒక పాత్రలో మైదా, పంచదార, బేకింగ్ సోడా, ఉప్పు వేసి చక్కగా కలపాలి. మరో పాత్రలో గుడ్లు, పాలు, వెనీలా ఎస్సెన్స్ వేసి బాగా గిలకొట్టాలి. ఇప్పుడు మైదా మిశ్రమం, గుడ్ల మిశ్రమం, అరటి గుజ్జు, బటర్ - అంతా ఒకే పాత్రలో వేసి జారుగా కలపాలి. ఈ మిశ్రమాన్ని నూనె రాసిన నాన్‌స్టిక్ పెనంపై దళసరిగా దోశల్లా పోసి రెండు వైపులా కాల్చుకోవాలి. ఇవి తేనెలో అద్దుకుని తింటే బాగుంటాయి.

ఫుడ్ కోర్ట్

## పొడి కూర

**కావలసిన పదార్థాలు**

(కూర) అరటి కాయలు - 3, శనగపప్పు, మినప్పప్పు - 2 టీ స్పూన్ల చొప్పున, ఆవాలు, జీలకర్ర - ఒక టీ స్పూను చొప్పున, పచ్చిమిర్చి - 4, అల్లం - అంగుళం ముక్క, కరివేపాకు - 4 రెబ్బలు, పసుపు - పావు టీ స్పూను, ఉప్పు - రుచికి తగినంత, నిమ్మరసం - ఒక టేబుల్ స్పూను, నూనె - 3 టేబుల్ స్పూన్లు.

**తయారుచేసే విధానం**

నూనె రాసిన అరటికాయల్ని నిప్పుల్లో లేదా, స్టౌవ్ పైన కాల్చి చల్లారిన తర్వాత పొడి గుజ్జుగా చేసి పక్కనుంచాలి. నూనెలో శనగపప్పు, మినప్పప్పు, ఆవాలు, జీలకర్ర, (కలిపి రుబ్బిన) అల్లం+పచ్చిమిర్చి ముద్ద .. ఒకటి తర్వాత ఒకటి వేస్తూ వేగించాలి. తర్వాత పసుపు, ఉప్పు, అరటి గుజ్జు కూడా వేసి బాగా కలిపి మగ్గనివ్వాలి. దించేముందు నిమ్మరసం పిండాలి.

# చెడు స్నేహం చేటు!

మలయ పర్వత ప్రాంతంలో ఒక అడవి ఉండేది. ఆ అడవికి 'దర్పసారము' అనే సింహం రాజుగా ఉండేది. దాని దగ్గర ఒక కాకి, నక్క మంత్రులుగా ఉండేవి. సింహం జంతువులను వేటాడి, తినగా మిగిలిన మాంసాన్ని తిని బతికేవి కాకి, నక్క. ఒక రోజు కాకి, నక్క అడవిలో తిరుగుతుండగా ఒక ఒంటె కనిపించింది. అది వాటితో "మీరు చూస్తే సాధు జంతువుల్లా ఉన్నారు. మీరే నాకు సాయం చేయాలి. ఈ అడవికి సమీపంలో ఉండే ఓ ఊరిలో ఉంటాన్నేను. నా యజమాని నాపైన మోయలేని బరువు వేసి, నాతో వెట్టిచాకిరి చేయించుకుంటున్నాడు. సరిగ్గా తిండి కూడా పెట్టడం లేదు. అందుకే పారిపోయి ఇలా అడవిలోకి వచ్చాను. నన్ను రక్షించరూ" అని వేడుకుంది. దాని మాటలు విన్న కాకి, నక్క "ఈ అడవికి రాజు సింహం, మేం అతని మంత్రులం. నిన్ను ఆయన దగ్గరకు తీసుకెళ్తాం. మృగరాజు దయ తలిస్తే ఈ అడవిలో స్వేచ్ఛగా తిరగవచ్చు" అన్నాయి. సరేనంది ఒంటె. మంత్రుల మాటలు విన్న సింహం, ఒంటెను కూడా తన దగ్గర మంత్రిగా నియమించుకుంది. అప్పటి నుంచి సింహం వేటాడగా మిగిలిన మాంసాన్ని ఒంటె, కాకి, నక్క పంచుకుని తినేవి. కష్టపడకుండానే కడుపునిండా తినడం వాటికి బాగా అలవాటైంది. ఇలా ఉండగా ఒకరోజు సింహానికి జబ్బు చేసింది. వేటాడేందుకు బలం సరిపోక, ఈ ఒక్కరోజూ తలా ఓ దిక్కుకూ వెళ్లి, తనకోసం జంతువులను వేటాడి తీసుకురమ్మని మంత్రులను ఆదేశించింది. సోమరితనం అలవాటైన వాటికి, అడవిలో ఎంత వెతికినా ఏమీ దొరకలేదు. తిరిగి, తిరిగి అలసిపోయిన నక్కా, కాకీ ఒక చోట తారసపడ్డాయి. అప్పుడు నక్కకి ఓ ఆలోచన వచ్చింది. వెంటనే కాకితో "మనకు వేటాడడం తెలీదు, కాబట్టి ఎంత వెతికినా ఆహారం దొరకదు. ఇలాగే ప్రయత్నిస్తే అలసటతో మనమూ చనిపోతాం. కాబట్టి రాజుగారికి ఒంటెను ఆహారంగా సమర్పిస్తే, ఆయన ఆకలీ, మన ఆకలీ తీరుతుంది. ఏమంటావ్" అంది. సరేనంది కాకి. రెండూ పథకం ప్రకారం మృగరాజు దగ్గరికెళ్లాయి. "రాజా! మేము అడవి మొత్తం తిరిగినా, ఆహారం దొరకలేదు. అందుకే మీరు ఈ రోజుకి నన్ను తిని మీ ఆకలి తీర్చుకోండి" అంది కాకి. "నువ్వు చాలా చిన్నదానివి. నిన్ను తింటే రాజుగారి ఆకలి తీరదు. కాబట్టి రాజా నన్ను తిని ఆకలి తీర్చుకోండి" అంది నక్క. ఈ మాటలు వింటూ అప్పుడే, అక్కడికొచ్చిన ఒంటె "రాజా, నా స్నేహితుల కంటే నేను ఆకారంలో చాలా పెద్దదాన్ని. కాబట్టి దయచేసి నన్ను తిని మీ ఆకలి తీర్చుకోండి" అని వేడుకుంది. ఆకలితో ఉన్న సింహం మరో ఆలోచన లేకుండా ఒంటెపైకి పంజాతో దాడిచేసి, చంపి తినేసింది. అది తినగా మిగిలిన మాంసాన్ని నక్క, కాకీ ఆనందంగా తిన్నాయి. చెడ్డవారితో స్నేహం చేసి, ప్రాణాలు కోల్పోయింది ఒంటె.



balajyothy

# బాలజ్యోతి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| i | d | l | e | t | t | u | c | e |
| c | i | d | v | t | l | w | c | b |
| e | n | r | s | b | v | o | w | f |
| c | o | a | s | i | r | d | g | j |
| r | s | z | c | n | b | n | b | r |
| e | a | i | a | d | e | i | m | z |
| a | u | l | r | e | d | w | x | l |
| m | r | f | f | r | g | h | f | x |
| b | a | c | k | p | a | c | k | q |

- scarf
- binder
- lizard
- window
- lettuce
- icecream
- dinosaur
- backpack




## తమాషా లెక్కలు 4

నవగ్రహాలు, నవరత్నాలు, నవధాన్యాలు... ఇలా చాలాచోట్ల తొమ్మిదికి ప్రత్యేకమైన స్థానం ఉంటుంది. అందుకేనేమో తొమ్మిదో ఎక్కంలో కూడా చాలామంది గమనించని ప్రత్యేకత దాగి ఉంది. ఆ ఎక్కంలో వచ్చే గుణిజాలను కూడితే, మళ్లీ తొమ్మిదే వస్తుంది. ఉదాహరణకు

9X 2 = 18, 1+8=9
9X 3 = 27, 2+7=9
9X 4 = 36, 3+6=9
9X 5 = 45, 4+5=9
9X 6 = 54, 5+4=9
9X 7 = 63, 6+3=9
9X 8 = 72, 7+2=9
9X 9 = 81, 8+1=9
9X 10 =90, 9+0=9
9X 11 =99, 9+9=18,1+8=9
9X 12 =108, 1+0+8=9
9X 13 =117, 1+1+7=9










దారి చూపించండి



చుక్కలు కలపండి

## రికార్డు 'తోముడు'!

ఉదయాన్నే పళ్లు తోమాలంటే మహా... బద్ధకంగా అనిపిస్తుంది చాలామంది పిల్లలకు! మరికొందరేమో టూత్‌బ్రష్ నోట్లో వేసుకుని, అటూఇటూ తిరుగుతూ చాలాసేపు కాలక్షేపం చేస్తుంటారు. అయితే పళ్లు తోమడంలో కూడా రికార్డు సృష్టించవచ్చని ఋజువుచేశారు బెంగళూరు పిల్లలు. ఒకరూ, ఇద్దరూ కాదు... ఏకంగా 17,505 మంది విద్యార్థులు ఒక్కచోట చేరి, శుభ్రంగా పళ్లు తోమి సరికొత్త గిన్నిస్ రికార్డు సృష్టించారు. వీళ్లంతా బెంగుళూరులోని వివిధ స్కూళ్లకు చెందినవారు. పిల్లల్లో దంత సంరక్షణ గురించి అవగాహన కలిగించేందుకు ప్రముఖ వైద్యులు గిరీష్ రావు అధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది. గతంలో ఈ రికార్డు దక్షిణ అమెరికాలోని విద్యార్థుల పేరిట ఉండేది. 1995లో 13,800 మంది విద్యార్థులు ఒకేసారి, ఒకేచోట పళ్లుతోమి గిన్నిస్‌కెక్కారు. మనవాళ్లు దాన్ని బద్ధలు కొట్టారిప్పుడు!



తేడాలు కనిపెట్టండి



### మీకు తెలుసా

- ఉడతలు, తల్లి లేని ఒంటరి పిల్లలను చేరదీసి పెంచుకుంటాయి.
- అమెరికన్ గోల్డ్ ఫించ్ అనే పక్షి, తన గూటిలో నీటిని కూడా నిల్వచేసుకోగలదు.
- జీబ్రాలు ఒంటరిగా పడుకోలేవు.

### జవాబులు

**తేడాలు కనిపెట్టండి:** ఏనుగు చెవిపైన గీత, కోతి చెవి, మొసలి కాళ్ల, జిరాఫీ తోక, కాలు, సింహం తోక

**విలువెంత?** యాపిల్ = 3, అరటిపండు= 2, క్యారెట్= 4

## నాటక కళకు కొత్త ఊపు

సినిమాలు, టీవీలు రాజ్యమేలుతున్న ఈ రోజుల్లో కూడా జనాన్ని ఆకట్టుకోగల ఇతివృత్తాలతో, పాత్రలతో విద్యాసాగర్ రావు రాసిన నాటకాలివి. సాయంత్రం ఆరైతే చాలు రవీంద్ర భారతిలోనో, వైఎంసీఏలోనో నాటకాలు చూస్తూనో, వేస్తూనో కనిపించే విద్యాసాగర్ రావు 'వేషం లేకపోయినా పరవాలేదు, కర్టెన్ లాగినా చాలు....' అనుకునేవారంటే నాటక కళ పట్ల ఆయనకున్న అంకితభావాన్ని అర్థం చేసుకోవచ్చు.

ఈ నాటికలు, నాటకాల్లో వృత్తి ఉద్యోగాల విశేషాలతో పాటు, బడుగు జీవి సామాజిక, కుటుంబ పరిస్థితులు, ప్రయాణాలు, వ్యక్తిగత సంబంధ బాంధవ్యాలు మొదలైనవన్నీ కళ్లకు కడతాయి. అటు ఢిల్లీలోనూ, ఇటు హైదరాబాద్‌లోనూ పెద్ద ఉద్యోగాలు నిర్వహించినా సామాన్య, నిరాడంబర జీవితానికే ప్రాధాన్యమిచ్చిన విద్యాసాగర్ రావు కూడా ఈ పాత్రల్లో కనిపిస్తారు. 'క్రంతవ్యులు', 'ఓ ఆఫీసు కథ', 'ఆప్‌కీ అదాలత్', 'ఇంటర్వ్యూ' వంటి నాటికలు మళ్లీ మళ్లీ చదవాలనీ, చూడాలనీ అనిపిస్తాయి. జీవితంలో కొన్ని విలువలు, నీతి నిజాయతీలను కచ్చితంగా పాటించాలని బోధించే కొన్ని పాత్రలు రక్తికట్టిస్తాయి. ఈ పాత్రలను గమనించినవారికి కూడా విద్యాసాగర్ రావు గుణగణాలే కళ్ల ముందు కనిపిస్తాయి. ఆయన నీటిపారుదల శాఖకు చెందిన ఇంజనీర్ అయినందువల్ల, తన అనుభవాలను కూడా ఈ పాత్రల్లో పండించారు. బహుశా అందుకేనేమో, రాష్ట్ర నీటిపారుదల శాఖ మంత్రి టి. హరీశ్‌రావు రెండు నెలల క్రితం విద్యాసాగర్ రావు నాటకాలను రవీంద్ర భారతిలో ప్రదర్శింపజేసినప్పుడు అవి ఆబాలగోపాలాన్నీ ఆకట్టుకున్నాయి. ఒక స్క్రీన్ ప్లే లాగా సాగిపోయే ఈ నాటకాలు, నాటికలు నాటక కళకు మళ్లీ ఒక ఊపు తెస్తాయనిపిస్తుంది.

**- జి. రాజశుక**

**ఆర్. విద్యాసాగర్‌రావు**
**నాటకాలు - నాటికలు**
సంకలనం:
డా. జె. విజయ్‌కుమార్‌జీ
**పేజీలు:** 380,
**వెల:** రూ. 250-00
**ప్రతులకు:** ప్రముఖ పుస్తకాల దుకాణాలు.



## జోకుల కదంబం

మొత్తం జోకుల్తో ఒక నవల రాయడం.. ఉత్తరాలతోనే అందమైన ప్రేమ కథను నడుపుతూ దాన్ని పూర్తిస్థాయి నవలగా తీర్చిదిద్దడం .. ఇవన్నీ 'ఆంధ్రుల ఆహ్లాద రచయిత' మల్లాది వెంకట కృష్ణమూర్తి మార్కు చమక్కులు. ఎక్కడెక్కడి జోకులూ గుదిగుచ్చి 'కల్నల్ ఏకలింగం ఎడ్వెంచర్స్', 'మిస్టర్ మిరియం' లాంటి సూపర్‌హిట్ నవలలు వెలువరించిన మల్లాది తాజా కలం 'సుందరి సుబ్రావ్'. ఆ రెండు పుస్తకాల్లాగానే ఇది కూడా విడిగా చదువుకుంటే జోకుల కదంబం. వరుసగా చదువుకుంటూ వెళ్తే సుందరి, సుబ్రావ్‌ల జీవితం. కానీ.. మొదటి రెండు పుస్తకాలూ విడుదలైనప్పుడు దేశంలో ఇంటర్‌నెట్ విస్తృతి ఇప్పుడున్నంతగా లేదు. కాబట్టి చాలా జోకులు కొత్తగా అనిపించేవి. ఈ పుస్తకంలోని జోకుల్లో చాలావరకూ ఇటీవలికాలంలో వాట్సప్, ఫేస్‌బుక్‌ల్లో విస్తృతంగా ప్రచారంలో ఉన్నవే. వాటిని మినహాయిస్తే మిగతావి మల్లాది శైలిలో ఆహ్లాదంగా ఉంటూ చదివిస్తాయి. డిమిత్రావు, ఢిల్లీరావు, వృషభేశ్వర్, కుక్కుటేశ్వర్, కురంగేశ్వర్, కుచలం.. ఇలా తన నవలల్లోని పాత్రలకు విచిత్రమైన పేర్లు పెట్టే ఆనవాయితీని మల్లాది ఇందులోనూ కొనసాగించారు.

**- కె.బి.ఎల్.శర్మ**

కొత్త పుస్తకాలు

**సుందరి-సుబ్రావ్**, మల్లాది వెంకట కృష్ణమూర్తి
**పేజీలు:** 240; **వెల:** రూ.195
**ప్రతులకు:** ప్రిజమ్ బుక్స్, 040-2761 2928/38




## కేవీఆర్ కవితా తూణీరం

విప్లవ సాహిత్యంతో దశాబ్దాలుగా పెనవేసుకుపోయిన కేవీఆర్ చాలామందికి విమర్శకుడిగా పరిచయం. ఆయన కవిత్వం గురించి ఇప్పటి తరంలోనే కాదు, వెనుకటితరం వారికి కూడా తక్కువే తెలుసు. ఈ కవిత్వాన్ని పరిశీలిస్తే, విమర్శలోనే కాదు.. కవిత్వంలో కూడా కేవీఆర్ చేసిన కృషి తక్కువేమి కాదని అర్థమవుతుంది. ఇంకా ఈ సంకలనంలో చేరని, ఎక్కడా అచ్చుకాని కవితలు 200 వరకూ ఉన్నాయంటే ఆశ్చర్యకరమే. రాశిలోనేగాక వాసిలో కూడా కేవీఆర్ కవిత్వం ఆయా కాలాల్లో నిలబడేదే. ఆరు సంపుటాల్లోని కవిత్వాన్ని ఒక దగ్గర చేర్చడం అభినందనీయమేగానీ.. ఎక్కడా ఎటువంటి ఫుట్ నోట్స్‌లు లేకపోవడం ఇబ్బందికరం. ఆయన ఏ సందర్భంలో, ఏ ఉద్దేశంతో రాశారో.. సాధ్యమైనంత వరకు తెలియజేసే ప్రయత్నం చేస్తే తరువాతి తరాల వారికి ఉపయోగకరంగా ఉంటుంది.

**- దేరా**

**కె.వి.ఆర్. కవిత్వం, పేజీలు:** 574, **వెల:** రూ.200
**ప్రతులకు:** 98490 83137




ఇవీ వచ్చాయి

**కలం అలిగింది** (కవితా సంపుటి)
రచన : డా. సి. నారాయణరెడ్డి
**పేజీలు** : 140, **వెల** : రూ.150
ప్రతులకు : నవచేతన బుక్ హౌస్

**యెల్ది మాణిక్యాలు** (మినీ కవితలు)
రచన : యెల్ది సుదర్శన్ పద్మశాలి
**పేజీలు** : 36, **వెల** : రూ.60
ప్రతులకు : 098924 11067

**సుందరీ సందేశం** (నిర్మకుట శతకం)
రచన : డా. కపిలవాయి లింగమూర్తి
**పేజీలు** : 54 **వెల** : రూ.50
ప్రతులకు : విశాలాంధ్ర

**ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ**
రచన : సి. భవానీదేవి
**పేజీలు** : 132, **వెల** : రూ.50
ప్రతులకు : సాహిత్య అకాడమీ శాఖలు

**ఆల్చిప్పలో అమృతబిందువు**
రచన : మందాడి కృష్ణయ్య
**పేజీలు** : 64, **వెల** : రూ.50
ప్రతులకు : నవోదయ, నవచేతన

**మాకు మేమే**
సంపా. : సంగినేని రవీంద్ర
**పేజీలు** : 136, **వెల** : రూ.150
ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాలు

**సంతోష సుభాషిణీయం** (లఘు కవితలు)
**పేజీలు** : 52, **వెల** : రూ.40

**స్నేహగీతాలు** (వచన కవితా కుసుమ సౌరభాలు)
**పేజీలు** : 126, **వెల** : రూ.50
రచన : కల్వకోట వేంకట సంతోష్ బాబు
ప్రతులకు : 98490 85727, 040-40165215

**మా పోరాటం**
(భీమదేవరపల్లి మండల తెలంగాణ ఉద్యమ చరిత్ర)
రచన : డా. ఏరుకొండ నరసింహస్వామి
డ్యాగల సారయ్య
**పేజీలు** : 264, **వెల** : రూ.200
ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాలు

# లైంగిక వ్యాధులకు హోమియోతో చెక్

**డా. మధు వారణాశి, ఎం.డి**
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509



రోజువారిలాగే క్లినిక్‌లో పేషంట్స్‌ను చూస్తున్నాను. వచ్చీపోయే పేషంట్స్‌తో క్లినిక్ అంతా చాలా బిజీగా ఉంది. సిసిటివిలోంచి గమనిస్తున్న నాకు హాల్‌లో కూర్చున్న ఒక యువకుడిలో ఏదో తెలియని భయం, ఆతృత, విపరీతమైన ఆందోళనా కనిపించాయి. ఆ తరువాత ఆ యువకుడు నా చాంబర్‌లోకి వచ్చాడు. "కూర్చో" అన్నాను. ఏదో బిగదీసుకుపోయినట్లు కూర్చున్నాడు. " ఏంటి ప్రాబ్లమ్?" అన్నాను. ఏదో శక్తినంతా కూడగట్టుకుని, సార్! నా పేరు కిశోర్. నాకు 28 ఏళ్ల. గుంటూరు నుంచి వచ్చాను. నాకో పర్సనల్ ప్రాబ్లం ఉంది. విషయం ఏమిటంటే రెండు నెలల క్రితం నేను ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. అదొక మధురమైన అనుభూతిని ఇచ్చిన మాట నిజమే. కానీ, ఓ 10 రోజుల తరువాత నా పురుషాంగం మీద చిన్నచిన్న ఎర్రని నీటి పొక్కులు కనిపించాయి. బాగా దురద వేయసాగాయి. విపరీతంగా భయపడిపోయి ఊళ్లో ఉన్న డాక్టర్‌కు చూపించాను. దాదాపు 8 రోజుల్లో సమస్య బాగా తగ్గిపోయింది. కానీ, మందులు మానేసిన కొద్దిరోజులకే మళ్లీ రావడం మొదలయ్యింది. అందుకే ఈ సమస్య శాశ్వతంగా పోయే వైద్య విధానం కోసం వెతుకుతున్నాను. హోమియోలో ఈ సమస్యకు అలాంటి మందులు ఏమైనా ఉన్నాయేమో తెలియచేయండి డాక్టర్ గారూ!" అన్నాడు. అతని ఆందోళన చూస్తే చాలా బాధాకరంగా అనిపించింది. అతని జననాంగం మీద చిన్న చిన్న నీటి పొక్కులు ఉన్నాయి ముందు భాగమంతా ఎర్రగా వాచి ఉంది. అతనికి ఉన్నది హెర్పస్ వ్యాధి అని స్పష్టమయ్యింది. "నువ్వేమీ భయపడకు ఈ వ్యాధిని నేను పూర్తిగా నయం చేస్తాను." అంటూ ధైర్యం చెప్పి కొన్ని మందులు రాసి పంపించాను.

**హెర్పిస్ జెనిటాలిస్ :** లైంగిక కలయిక తరువాత పురుషాంగం మీద చెమటకాయలంత ఆకారంతో ఎర్రటి నీటిపొక్కులు కనిపిస్తాయి. నొప్పితో పాటు విపరీతమైన దురద ఉంటుంది. వెంటనే తగు జాగ్రత్తలు తీసుకోకపోతే ఇది ఇతరులకు సోకే ప్రమాదం కూడా ఉంది. దీనివల్ల ఇతరమైన లైంగిక సమస్యలు తలెత్తడంతో పాటు, కొంతమంది స్త్రీలకు గర్భస్రావం అయ్యే అవకాశం కూడా ఉంది.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద శృంగారం తరువాత ముందుగా కనిపించే గనేరియా లక్షణం. దీనికి తోడు జిగురుగా ఒక ద్రవం వస్తుంది. పొత్తి కడుపులో నొప్పి, వీర్యంలో మంట, వీర్యంలో రక్తం రావడం కూడా ఈ వ్యాధి లక్షణాలే.

**వెనెరల్ వార్ట్స్ :** పురుషాంగం మీద చిన్నచిన్న కాలిఫ్లవర్ లాంటి పులిపిర్లు వస్తాయి క్రమంగా ఇవిగుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుండ్లు :** ఇది కూడా రతిక్రియ ద్వారా సంక్రమించే సమస్యే. లైంగిక సంపర్కం జరిగిన 3 నుంచి 5 రోజుల లోగా ఈ వ్యాధి బయటపడవచ్చు. జననాంగం మీద రెండుమూడు పుండ్లు ఏర్పడతాయి. ఎర్రగా ఉండి ఇవి రుద్దినప్పుడు బాగా మంట కలిగిస్తాయి.

**పరిష్కారం ఏమిటి? :** లైంగిక క్రియ ద్వారా సంక్రమించే ఈ వ్యాధులన్నిటినీ నయం చేసే వైద్య చికిత్సలు హోమియోలో ఉన్నాయి. ఇతర వైద్య విధానాల్లో చేసే పై పూతల వల్ల వ్యాధి తాత్కాలికంగా తగ్గినా ఆ వ్యాధి తిరిగి వచ్చే ఆస్కారం ఉంది. అయితే హోమియో వ్యాధి మూలకారణాల్ని గుర్తించి సమస్యను సమూలంగా తొలగిస్తుంది. ఏమైనా కిశోర్ నేను రాసిన మందులన్నీ వాడి హెర్పస్‌నుంచి విముక్తి పొందాడు.

# హెపటైటిస్-బికి హోమియోతో చికిత్స

ఆ రోజు సోమవారం. క్లినిక్ పేషెంట్స్‌తో బిజీగా ఉంది. 10 గంటలకు నా ఛాంబర్‌లోకి ఒక మధ్యవయస్కురాలు వచ్చింది. వారితో పాటు ఆమె భర్త తోడుగా వచ్చారు. జూనియర్ డాక్టర్ తీసుకున్న కేస్‌షీట్‌ను నా చేతికిచ్చింది. మొహంలో ఆందోళన,భయం. 'చెప్పమ్మా! ఏంటి నీ ప్రాబ్లమ్, ఎక్కడి నుంచి వచ్చారు?' అని అడిగాను. మాది మచిలీపట్నమండీ(ఏడుపు దిగమింగుకుంటూ)"డాక్టర్‌గారూ నాకు పెద్ద సమస్య వచ్చింది అని కళ్లలో నీళ్ల తెచ్చుకుంది. వెంటనే ఆమె భర్త నా భార్యకు హెపటైటిస్ బి వచ్చింది. ఎలా వచ్చిందో తెలియడం లేదు. నా భార్య చాలా భయపడుతోంది. ఏం చేయాలో మా ఇద్దరికీ అర్థం కావడం లేదు. వెంటనే ఆమె కల్పించుకుని డాక్టర్‌గారూ నాకు చనిపోవాలని ఉంది. చాలా భయంగా ఉంది. మీ ఆర్టికల్స్ చదివాను, మీ టీవీ షోస్ చూశాను. మీరు చెప్పిన విషయాలు విన్న తరువాత జీవితంపై ఆశ కలిగింది. అందుకే మీ దగ్గరకు వచ్చాను. నిజంగా ఇది తగ్గుతుందా? జీవితాంతం ఈ సమస్యకు పరిష్కారం లేదని అంటున్నారు. నిజం చెప్పండి " అంటూ కన్నీళ్లు పెట్టుకుంది. చూడమ్మా హెపటైటిస్ అనేది కాలేయానికి సంబంధించినది. మానవ శరీరంలో కాలేయం అతి ముఖ్యమైన భాగం. ఈ వైరస్ సోకగానే బయటకు ఎటువంటి లక్షణాలు కనిపించవు. కొంతకాలంపాటు ఆ వైరస్ శరీరంలో నిద్రాణంగా ఉంటుంది.

## హెపటైటిస్-బి అంటే ఏమిటి?

ఏకారణం చేతనైనా కాలేయం దాని సహజపరిమాణం కంటే వాచి వ్యాధిగ్రస్తం కావడాన్ని హెపటైటిస్ అంటారు. సాధారణ భాషల్లో దీన్ని పచ్చకామెర్లు, పసరికలు, జాండిస్ అని పిలుస్తుంటారు. ఈ వ్యాధి వైరస్ కారణంగా సంక్రమిస్తుంది. చాలా మందికి కాలేయం దెబ్బతినే వరకు హెపటైటిస్ ఉన్న విషయం తెలియదు. వ్యాధిని గుర్తించే సమయానికి తీవ్రమవుతుంది.

## కారణాలు

రక్తదానం, వీర్యం, కలుషితమైన రక్తం, దానికి సంబంధించిన ప్లేట్‌లెట్స్, ప్లాస్మా వంటివి శరీరంలోకి ఎక్కించినపుడు స్టెరిలైజ్ చేయని సూదులు, సిరంజిలు వాడటం, ఒకేసూదితో ఎక్కువ మంది పచ్చబొట్టు వేయించుకోవడం, ఒకేటూత్‌బ్రష్ ఎక్కువ మంది వాడటం, ఇతరులు ఉపయోగించిన బ్లేడ్‌లు వాడటం, హెపటైటిస్ ఉన్న వారితో లైంగిక సంబంధాలు పెట్టుకోవడం వల్ల వైరస్ సంక్రమించే అవకాశం ఉంది.

## లక్షణాలు

చాలా మంది హెపటైటిస్ రోగుల్లో లక్షణాలు బయటపడవు. వ్యాధి ముదిరే కొద్ది లక్షణాలు బయటపడుతుంటాయి. తరుచుగా జ్వరం, ఒళ్లనొప్పులు, మూత్రం, కళ్లలో పచ్చదనం, మలం తెల్లగా రావడం, రోగనిరోధక శక్తి తగ్గడం, తరచుగా తలనొప్పి, కండరాల నొప్పులు, గొంతులో నొప్పి,వెలుతురు చూడలేకపోవడం, భోజనం రుచించకపోవడం వంటి లక్షణాలుంటాయి. హె పటైటిస్ వ్యాధి క్రానిక్‌గా మారినపుడు లివర్ సిర్రోసిస్, లివర్ ఫెయిల్యూర్, లివర్ కేన్సర్ వచ్చి లక్షణాలు బయటపడతాయి. ఈ దీర్ఘవ్యాధి బయటపడటాని 5 నుంచి 20 సంవత్సరాల సమయం పడుతుంది.

అన్ని విషయాలు వివరంగా చెప్పిన తరువాత ఆ ముఖంలో కొంచెం ఆశ కనిపించింది. మీరు చెప్పినట్లు ట్రీట్‌మెంట్ తీసుకుంటాను అంది. శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు పరిశీలించి మందులు ఇచ్చాను. లక్షణాలను బట్టి మందులు మార్చుతూ వచ్చాను. ఏడాదిపాటు ట్రీట్‌మెంట్ కొనసాగించాను. ప్రతినెల ఆమెలో శారీరకంగా, మానసికంగా ఆమెలో చాలా మార్పు కనిపించింది. ఆకలి పెరిగింది. బాగా యాక్టివ్ అయింది. ఏడాది తరువాత పరీక్ష చేస్తే వైరల్ లోడ్ డిటెక్షన్ లిమిట్‌కు వచ్చింది. ఆమె ఎంతో సంతోషించింది. భార్యాభర్తలిద్దరూ ఎంతగానో కృతజ్ఞతలు చెప్పారు.



# అనుగ్రహం

3 - 9 సెప్టెంబర్ 2017

డాక్టర్ పి.ఎ. రామన్


మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

వ్యవహారాల్లో ప్రతికూలతలెదుర్కొంటారు. మనసు స్థిమితంగా ఉండదు. ఖర్చులు అంచనాలను మించు తాయి. ఇంట్లో స్తబ్దత నెలకొంటుంది. బుధ, గురువారాల్లో అనేక పనులతో సతమతమవుతారు. ఆప్తుల రాక ఉపశమనం కలిగి స్తుంది. ఆంతరంగిక విషయాలు గోప్యంగా ఉంచండి. బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. అకారణంగా మాటపడవలసి వస్తుంది.


తుల

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

మీ యత్నాలకు కుటుంబ ప్రోత్సాహం ఉంటుంది. సంప్రదింపులు ఫలిస్తాయి. వ్యూహాత్మకంగా వ్యవహ రిస్తారు. ఖర్చులు సామాన్యం. పరిచయాలు బలపడ తాయి. పెట్టుబడులు, పొదుపు పథకాలపై దృష్టి పెడతారు. పనులు నిదానంగా సానుకూలమవుతాయి. బుధవారం నాడు పత్రాలు, విలు వైన వస్తువులు జాగ్రత్త. బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు.


వృషభం

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. మొహ మాటాలకు పోవద్దు. మీ ఇష్టాయిష్టాలను స్పష్టంగా తెలియజేయండి. సకాలంలో వాయిదాలు చెల్లిస్తారు. పనులు నిదానంగా సానుకూలమవుతాయి. శుక్ర, మంగళ వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. కొన్ని విషయాల్లో పెద్దల జోక్యం అనివార్యమవుతుంది. ఆందోళన కలిగించే సంఘటనలెదురవుతాయి.


వృశ్చికం

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

లక్ష్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. ఆదాయా నికి తగ్గట్టు ఖర్చులుంటాయి. రుణం కోసం యత్నాలు సాగిస్తారు. కొత్త సమస్యలు తలెత్తుతాయి. విమర్శలకు దీటుగా స్పందిస్తారు. లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆసక్తికర మైన విషయాలు తెలుసుకుంటారు. బంధువుల రాక ఇబ్బంది కలిగి స్తుంది. గురు, శుక్ర వారాల్లో దంపతుల మధ్య సఖ్యత లోపం.


మిథునం

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. బాధ్యతలు స్వీక రిస్తారు. సాధ్యంకాని హామీలివ్వవద్దు. ఊహించిన ఖర్చులే ఉంటాయి. వాహనం, గృహోపకరణాలు కొను గోలు చేస్తారు. శని, ఆది వారాల్లో పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. పెట్టుబడులకు తరుణం కాదు. కీలక పత్రాలు అందుతాయి. అయిన వారితో ఉల్లాసంగా గడుపుతారు. పెద్దల ఆరోగ్యం కుదుటపడుతుంది.


ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

బాధ్యతగా వ్యవహరించాలి. మీ గౌరవానికి భంగం కలిగే సూచనలున్నాయి. ఆధిపత్యం ప్రదర్శించవద్దు. అవ సరాలకు డబ్బు అందుతుంది. పనుల ప్రారంభంలో ఆటంకాలెదురవుతాయి. పెట్టుబడుల విషయంలో పునరాలోచన మంచిది. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. శనివారం నాడు ప్రతి వ్యవ హారం స్వయంగా చూసుకోవాలి. ఆత్మీయులను కలుసుకుంటారు.


కర్కాటకం

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. అవిశ్రాం తంగా శ్రమిస్తారు. కృషి ఫలిస్తుంది. ధనయోగం, వస్తు లాభం ఉన్నాయి. ఖర్చులు సామాన్యం. దంపతుల మధ్య సఖ్యత నెలకొంటుంది. వ్యవహారాలు ఇతరులకు అప్పగించకుండా స్వయంగా చూసుకోవాలి. సోమ, మంగళ వారాల్లో సలహాలు, సహా యం ఆశించవద్దు. పెట్టుబడుల విషయంలో పునరాలోచన అవసరం.


మకరం

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

ఆర్థికస్థితి సామాన్యం. ఏ పురోగతీ లేక నిరుత్సాహం చెందుతారు. కష్టపడినా ఫలితం ఉండదు. నిరాశ వీడి యత్నాలు సాగించండి. మీ కృషి ఫలించే రోజు త్వరలోనే ఉంది. అవసరాలు నెరవేరుతాయి. చెల్లింపులు, చెక్కుల జారీలో జాగ్రత్త. ఆది, సోమ వారాల్లో అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. సర్దుబాటు ధోరణితో సమస్యలు పరిష్కరించుకోవాలి.


సింహం

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఆర్థికంగా ఫర్వాలేదనిపిస్తుంది. చెల్లింపులు, డబ్బు స్వీకరణలో జాగ్రత్త. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. వాగ్ధాటితో ఆకట్టుకుంటారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. పనులు మొండిగా పూర్తి చేస్తారు. పరి చయం లేని వారితో జాగ్రత్త. ప్రకటనలను విశ్వసించవద్దు. ఆశ్చర్య కరమైన సంఘటనలెదురవుతాయి. విద్యార్థులు పోటీల్లో రాణిస్తారు.


కుంభం

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఎదుటి వారి ఆంతర్యం గ్రహించండి. పంతాలు, భేష జాలకు పోవద్దు. విజ్ఞతగా వ్యవహరించాలి. అర్ధంతరంగా నిలిపివేసిన పనులు పూర్తి చేస్తారు. ఆదాయ వ్యయాలు ఫర్వాలేదనిపిస్తాయి. పరిచయస్తులు ఆర్థిక సహాయం అర్థిస్తారు. పెద్ద మొత్తంలో సాయం శ్రేయస్కరం కాదు. మంగళ, బుధ వారాల్లో ఇతరుల బాధ్యతలను చేపట్టి ఇబ్బందులెదుర్కొంటారు.


కన్య

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

పరిచయస్తుల వ్యాఖ్యలు మనస్తాపం కలిగిస్తాయి. కొన్ని విషయాలు పట్టించుకోవద్దు. విమర్శించిన వారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. డబ్బుకి ఇబ్బంది ఉండదు. రుణ బాధలు తొలగుతాయి. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు వస్తుంది.


మీనం

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఉన్నత పదవులు చేజిక్కించుకుంటారు. బంధువుల రాకపోకలు అధికమవుతాయి. సాధ్యం కాని హామీలివ్వ వద్దు. ప్రత్యర్థులతో జాగ్రత్త. ఖర్చులు విపరీతం. విలాసా లకు బాగా వ్యయం చేస్తారు. స్థిరాస్తి కొనుగోలు దిశగా ఆలోచనలుం టాయి. వ్యవహార ఒప్పందాల్లో మెలకువ వహించండి. తొందరపాటు నిర్ణయాలు తగవు. జూదాలు, పందాలకు దూరంగా ఉండాలి.




Dr. K Ravikirane
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# హెర్పిస్ సమస్య మళ్లీ రాలేదు

**మా ఊరు** రాజమండ్రి. నా పేరు రాజేష్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెర్పిస్ ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం అదే అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జబ్బు తగ్గదని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారు చెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

హెర్పిస్‌కు కారణం హెచ్ఎస్‌వి(హెర్పిస్ సింప్లెక్స్ వైరస్). ఇది ఒకరకమైన వ్యాప్తి చెందే వ్యాధి. ముఖ్యంగా నోరు, పెదాలు, నాలుక, జననాంగాలలో వచ్చే వ్యాధి ఇది. నోటిలో వచ్చే వ్యాధిని ఓరల్ హెర్పిస్ అంటారు. బుగ్గలపై, ముఖంపై రావచ్చు. జననాంగాలపై వచ్చే వ్యాధిని జెనెటల్ హెర్పిస్ అంటారు. ఇందులో రెండు రకాలుంటాయి. ఒకటి హెచ్ఎస్‌వి 1, రెండోది హెచ్ఎస్‌వి2.

**హోమియో చికిత్స**

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.

# హెపటైటిస్ బాధ ఇలా తగ్గింది

**ఒకరోజు** సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**లక్షణాలు :** హెపటైటిస్ బి వ్యాధి బయటపడటం చాలా ఆలస్యంగా జరుగుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత కూడా వ్యాధి బయటపడవచ్చు. వైరస్‌కి పరిసరాలు సహకరించేంతవరకు అది వేచి ఉంటుంది. ఆ తర్వాతే అది దాడి చేస్తుంది. వాంతి వచ్చినట్లుగా వికారంగా ఉండటం, వాంతులు రావడం. ఆకలి వేయక పోవడం, ఆహారం సహించకపోవడం. మూత్రం పసుపు రంగుతో, కళ్లు పచ్చగా ఉండటం ఉండటం. ఆర్టరీస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి,రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది. కొన్ని సార్లు లివర్ కేన్సర్‌కు కూడా దారితీస్తుంది.

**చికిత్స తరువాత**

హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంత మైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్య లకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు.

# ఆస్తమా శాశ్వతంగా పోయింది

**ఆస్తమా** ఒకసారి వస్తే తగ్గదని అనుకుంటారు. కానీ అది నిజం కాదని మా విషయంలో రుజవయింది. సరైన డాక్టర్‌ను ఎంపిక చేసుకుని చికిత్స తీసుకుంటే ఆస్తమా ఆనవాళ్లే కనిపించకుండా పోతాయి. మా బాబుకు ఇన్‌హేలర్ వాడటం తప్పనిసరి అన్నారు. కానీ మాకు హోమియో వైద్యంపై నమ్మకం ఉంది. అందుకే డాక్టర్ రవికిరణ్‌గారిని కలిసి చూపించాను.

మా బాబు వయస్సు ఏడేళ్లు. చిన్నప్పటి నుంచి జలుబు సమస్య ఎక్కువగా ఉండేది. సాధారణ జలుబే కదా అనుకున్నాం. కానీ తరువాత ఆస్తమా మొదలయింది. రాత్రి పడుకున్నప్పుడు పిల్లికూతలు వచ్చేవి. శ్వాస తీసుకోవడానికి ఇబ్బంది పడేవాడు. దగ్గు వచ్చేది. కొంచెం దూరం పరుగెత్తినా ఆయాసపడేవాడు. చలికాలంలో ఈ సమస్య మరింత ఎక్కువ ఉండేది. అల్లోపతి డాక్టర్‌ను కలిస్తే ఇన్‌హేలర్ వాడమని సూచించారు. ఇంత చిన్న వయసులోనే ఇన్‌హేలర్ వాడకం మొదలుపెడితే ఎలా? మాకు అసలు ఇష్టం లేదు. అందుకే డాక్టర్ రవికిరణ్‌గారి దగ్గరకు వెళ్లాం. మేం చెప్పినదంతా ఓపిగ్గా విని భయపడాల్సిన అవసరం లేదని ప్రారంభ దశలోనే ఉంది కాబట్టి హోమియో మందులతో సులభంగా తగ్గిపోతుందని చెప్పారు. ఒకటి రెండు నెలలు మందులు వాడి మానేస్తే ఫలితం ఉండదని, పూర్తి కోర్సు తీసుకున్నప్పుడు ఫలితాలు బాగుంటాయని చెప్పారు. డాక్టర్ గారు చెప్పినట్టుగా పూర్తి కోర్సు మందులు వాడాం. ఇప్పుడు మా బాబు పూర్తి ఆరోగ్యంగా ఉన్నాడు. ఆస్తమా ఆనవాళ్లే లేకుండా పోయింది.

జీవనవిధానం మార్చుకోవడంతో పాటు హోమియో చికిత్స తీసుకుంటే ఆస్తమా ఇట్టే దూరమవుతుంది. మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత ఆస్తమా తిరిగి రావడం అంటూ జరగదు.


మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ,
కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106


V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి
డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

ADVT

# స్పోర్ట్స్ క్విజ్ - 14

1. ఇదొక ఫుట్‌బాల్ స్టేడియం, ఎక్కడుందో చెప్పగలరా?

2. 60 ఓవర్లు, 50 ఓవర్లు, 20 ఓవర్ల క్రికెట్ వరల్డ్ కప్‌లను గెలిచిన దేశం ఏది?

3. 2018లో జరిగే పురుషుల, మహిళల హాకీ వరల్డ్‌కప్‌ను ఏయే దేశాలు నిర్వహిస్తున్నాయి.

4. ఎం.ఎల్. జయసింహ, రవిశాస్త్రి ఈ ఇద్దరు మాజీ క్రికెటర్స్ మధ్య ఆటలో ఒక పోలిక ఉంది... అదేమిటి?

5. ఒలింపిక్స్‌లో పాల్గొని తొలిసారి పతకం గెలిచిన బాడ్మింటన్ క్రీడాకారిణి ఎవరు?

**జవాబులు :**

1. ఉత్తర కొరియాలోని 'రంగ్‌నాడొ ఫస్ట్ ఆఫ్ మే స్టేడియం'. లక్షాయాభై వేల మంది ప్రేక్షకులు వీక్షించేలా ఈ స్టేడియాన్ని 1989లో నిర్మించారు.

2. ఇండియా. 1983లో 60 ఓవర్ల వరల్డ్ కప్‌ను, 2007లో 20 ఓవర్ల వరల్డ్ కప్‌ను, 2011లో 50 ఓవర్ల వరల్డ్ కప్‌ను గెలిచింది. ఈ రికార్డును సమం చేయడానికి ఒక్క వెస్టిండీస్‌కే అవకాశం ఉంది.

3. ఇండియా, ఇంగ్లండ్. పురుషుల హాకీ వరల్డ్‌కప్‌ను ఇండియా నిర్వహిస్తుండగా, మహిళల హాకీ వరల్డ్ కప్‌ను ఇంగ్లండ్ నిర్వహించనుంది.

4. ఒక టెస్ట్ మ్యాచ్‌లో ఐదు రోజులు బ్యాటింగ్ చేయడం. 1960లో ఎం.ఎల్. జయసింహ ఆస్ట్రేలియాతో మ్యాచ్‌లో, 1984లో రవిశాస్త్రి ఇంగ్లండ్‌తో మ్యాచ్‌లో ఐదు రోజులూ బ్యాటింగ్ చేశారు.

5. సైనా నెహ్వాల్. 2012లో లండన్‌లో జరిగిన ఒలింపిక్స్‌లో కాంస్య పతకం సాధించింది. అంతేకాక ఈమె ప్రకాష్ పడుకొనె తరువాత ప్రపంచ నెంబర్ వన్ ర్యాంక్‌ను చేరుకున్న క్రీడాకారిణి కూడా.

## గత వారం జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రా | 2 వి | ❄ | 3 అ | పో | 4 హ | ❄ | 5 జా | 6 మా | 7 త | ❄ |
| ❄ | 8 మ | 9 మ | త | ❄ | మే | ❄ | 10 బా | ల | రా | 11 జు |
| 12 ద | ర్శ | క | డు | ❄ | 13 షా | 14 మి | లి | ❄ | ❄ | గు |
| మ్మి | ❄ | టం | ❄ | 15 మా | ❄ | ష | ❄ | 16 వి | ❄ | ప్స |
| 17 డి | 18 ప్స | ❄ | 19 ఐ | రే | 20 ని | ❄ | 21 క | య్యం | ❄ | ❄ |
| ❄ | 22 మ | 23 సీ | దు | ❄ | 24 దు | 25 బా | సి | ❄ | 26 ము | 27 దం |
| 28 చి | రా | కు | ❄ | 29 బె | ర | డు | ❄ | 30 క | ల్లా | పు |
| ను | ❄ | ❄ | 31 అ | ల్లం | ❄ | 32 గ | బ్బి | లం | ❄ | డు |
| 33 కు | 34 బే | రు | డు | ❄ | 35 వి | ❄ | ❄ | 36 కా | 37 సు | ❄ |
| ❄ | తా | ❄ | 38 సు | 39 కృ | తం | ❄ | 40 పా | రి | జా | 41 తం |
| 42 క | శ | త్రం | ❄ | 43 ప | డ | మ | ర | ❄ | 44 త | పం |

# పూరణం

నిర్వహణ : **గొరుసు**

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | ❄ | 3 | | 4 | ❄ | 5 | ❄ | 6 | |
| 7 | | | | ❄ | 8 | | | 9 | | ❄ |
| 10 | | ❄ | 11 | 12 | | ❄ | 13 | | ❄ | 14 |
| ❄ | ❄ | 15 | ❄ | | ❄ | 16 | | | ❄ | |
| 17 | ❄ | 18 | 19 | | ❄ | | ❄ | ❄ | 20 | |
| 21 | 22 | | | ❄ | 23 | | 24 | 25 | ❄ | |
| ❄ | 26 | | ❄ | 27 | | ❄ | 28 | | 29 | |
| 30 | | ❄ | 31 | ❄ | 32 | | | ❄ | | ❄ |
| | ❄ | 33 | | 34 | | ❄ | ❄ | ❄ | 35 | 36 |
| 37 | 38 | | ❄ | | ❄ | 39 | 40 | 41 | | |
| ❄ | 42 | | | | ❄ | 43 | | | ❄ | |

## అడ్డం

1. అచ్చ తెనుగులో రైలు ఏ శకటం? (2)
3. ధనమే - సిరి జంట (3)
6. రాయబారం (2)
7. భార్యాభర్తలు కొంగులు ముడేసుకుని చేసే (తీర్థ) స్నానాలు (4)
8. ఈయన యముడ్ని ఎదిరించిన సావిత్రికి పతి (5)
10. మనసుకు సంబంధించిన చింత (2)
11. కైకేయి ఆంతరంగిక చెలికత్తెను పిలవండి (3)
13. శ్రాద్ధకర్మల్లో చేసే దానం (2)
16. కొంగ (3)
18. నిష్ఠగల చివరి సంతానం (3)
20. పండు మేలిమైనా, లోన పురుగులే-అట్నుంచి (2)
21. దారితప్పిన దోమ (4)
23. శాంతిభద్రతలు నశించిన పరిస్థితి (4)
26. నవరత్నాల్లో ఒకటి (2)
27. దప్పిక (2)
28. సాగిన ముఖం (4)
30. ఎదిగిన పంట (2)
32. కళ్లకు అందమిచ్చే అంజనం (3)
33. అక్కర (4)
35. నాగలిని తలపించే ఒకప్పటి నాట్యతార (2)
37. వీధీ వీధీ తిప్పిన బావకు .. ఎంత గంధం పూశారు? (3)
39. వెనక్కి వాలిన గడ్డికుసుమం (5)
42. రోమాంచిత ఉద్వేగం (4)
43. సందర్భాన్ని బట్టి ఉద్యోగం / సేవ / ఆస్థానం (3)

## నిలువు

1. సంస్కృతంలో బూడిదవర్ణం (3)
2. భర్త తమ్ముడు (3)
3. కలయిక (3)
4. విజయదశమి (3)
5. బాహుబలిలో తమన్నా ధరించిన పాత్ర(4)
6. పరుగు (2)
9. వెండిబంగారాల కొలత (3)
12. ఒక నక్షత్రం (3)
14. స్వర్ణసీతతో రాముడు చేసిన యజ్ఞం (5)
15. కలిసి ఉండటం .. ఇదే మహాబలమట!(4)
16. నవ్వులపాలైనవారిని ఇలానూ పిలుస్తాం...(3)
17. సాముద్రికంలో సగం వ్యాయామమే! (2)
19. రాత్రి (2)
22. (నూనె/వస్త్రం) కాలిన కంపు (3)
23. గర్వం (4)
24. ప్రియం కాదు - తక్కువ ఖరీదు (3)
25. దీనికి లేని దురద కత్తికెందుకట! (2)
29. చెంచిత (చెంచులక్ష్మి) ప్రియుడు (4)
30. సిఫారసు లాంటిదే (3)
31. చాపల్యం (2)
33. ప్రశ్నించు / పాదం (3)
34. సరాసరి (3)
36. పడవ నిలవాలంటే ఇది వేయాల్సిందే (3)
38. వేడి (2)
39. కరిగించాల్సిన మదం - కిందనుండి (2)
40. రత్నమాలిన్యం (2)
41. తోక తెగిన కవులు (2)

